Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)
స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి
Longest Living Newspaper in Telugu Journalism

# జమీన్‌రైతు

సంపుటి: 83 • సంచిక: 27 • 5-7-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



# తెలంగాణ నిజమా, నాటకమా?

ప్రత్యేక తెలంగాణ ఇవ్వడానికి సోనియాగాంధీ సన్నద్ధురాలైనారన్న సంకేతాలు ప్రబలంగా వ్యాపిస్తున్నాయి. ఢిల్లీలో గత రెండు వారాలుగా జరిగే పరిణామాలు ఆ దిశలో అధిష్టానం అభిమతాన్ని తేటతెల్లం చేస్తున్నాయి. ముఖ్యమంత్రి, ఉప ముఖ్యమంత్రి, పిసిసి అధ్యక్షుల నుంచి నివేదికలు కోరడం, తెలంగాణ ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్న జెఏసి నేత కోదండ రాంను ఢిల్లీకి పిల్పించడం ఈ దిశలో తాజా పరిణామాలు. జూన్ 30తేది కాంగ్రెస్ మంత్రులు నిర్వహించిన నిజాం కాలేజి సభ సైతం అధిష్టానం ఆదేశం ప్రకారమే జరిగిందనే వార్తలొస్తున్నాయి. రాష్ట్ర పర్యనటకు తొలిసారిగా వచ్చిన పార్టీ పరిశీలకుడు దిగ్విజయ్‌సింగ్ సైతం ఆ కోణంలో చాలినన్ని సంకేతాలు ఇచ్చి వెళ్లాడు. వీటన్నిటినీ నిశితంగా పరిశీలిస్తే తెలంగాణ విషయంలో కాంగ్రెస్ పెద్దలు ఒక స్థిర నిర్ణయానికి వచ్చినట్లు చెప్పకనే అర్థమైపోతున్నది.

అయితే ఆ నిర్ణయం ఏమిటి అన్నది ప్రశ్న. నిజంగానే తెలంగాణ ఇవ్వడానికి సోనియాగాంధీ సిద్ధపడుతున్నారా లేక రేపటి ఎన్నికల కోసం ఒక కొత్త నాటకానికి తెర తీస్తున్నారా అన్నది సందేహం.

తెలంగాణ ఇవ్వడం అంత సులభమైన విషయం కాదు. ఒకరోజులో తీసుకోదగిన నిర్ణయం కాదు. తెలంగాణ కోరుతూ ఎంత ఉధృతమైన ఉద్యమం నడుస్తున్నదో, దానికి అంతే స్థాయిలో వ్యతిరేకత వుంది. తెలంగాణ ప్రకటన అంటూ జరిగితే రాష్ట్రం తీవ్రమైన రాజకీయ సంక్షోభంలో కూరుకపోతుంది. ఆంధ్ర ప్రాంతంలో ఉవ్వెత్తున ఉద్యమం చెలరేగే ప్రమాదం వుంది. కాంగ్రెస్ పార్టీ జాతీయ పార్టీ. ఒక్క ఆంధ్ర రాష్ట్రాన్ని ఉద్దేశించి నిర్ణయాలు చేయలేదు. ప్రత్యేక రాష్ట్ర ఉబలాటాలు దేశమంతా వున్నాయి. ఈశాన్య రాష్ట్రాలు, విదర్భ, బుందేల్‌ఖండ్, గూర్ఖాల్యాండ్, హరిత ప్రదేశ్ వంటి కోరికలున్నాయి. ఇక్కడ ఒక నిర్ణయం తీసుకొని అక్కడ వేరొక మాట చెప్పలేరు. ఈశాన్య రాష్ట్రాలలో కానీ, గూర్ఖాల్యాండ్ విషయంలో కానీ వేర్పాటుకు ఏ మాత్రం అవకాశం ఇచ్చినా దేశ భద్రత, సమగ్రతలకే ముప్పు వచ్చే ప్రమాదం వుంది. అదొక కందిరీగల తుట్టె క్రింద లెక్క. మొదలు పెడితే ఎక్కడ ఆగుతుందో ఎవరూ వూహించలేరు. మరొకప్రక్క ప్రధాన మంత్రి, హోంమంత్రిత్వ శాఖ నిపుణులు తెలంగాణ ఏర్పాటును వ్యతిరేకిస్తున్నారు. అది ఇవ్వడం అంటే మరొక చత్తీస్‌ఘడ్‌ను సృష్టించుకోవడంగా భావిస్తున్నారు. మావోయిస్టుల భూతాన్ని చూపుతున్నారు.

అయితే కాంగ్రెస్‌కు తెలంగాణ ఇవ్వాల్సిన అవసరం చాలా వుంది. రాజకీయంగా వారు రేపు కేంద్రంలో మళ్లీ అధికారంలోకి రావాలంటే ఆంధ్రలో ఎన్నో కొన్ని ఎమ్పీ స్థానాలు సంపాదించుకోక తప్పదు. వైఎస్ జగన్ పుణ్యమా అని ఆంధ్రలో కాంగ్రెస్ పార్టీ దిగజారిపోయిందన్న నిజం వారికి బాగా తెలుసు. తెలంగాణ ఇస్తే, కనీసం 17 ఎమ్పీ స్థానాలలో పార్టీ పరిస్థితి మెరుగు పడుతుంది. అందువల్లనే ఈ తొందర అని పరిశీలకుల అభిప్రాయం.

తెలంగాణ ఇస్తే మన రాష్ట్రం వరకు కాంగ్రెస్‌కు చాలానే రాజకీయ లాభాలున్నాయి. మొదటగా వైఎస్‌జగన్ ప్రాబల్యాన్ని నిర్వీర్యం చేయవచ్చు. తెలంగాణ ఏర్పాటు అంటూ జరిగితే ఈ ప్రాంతంలోని కాంగ్రెస్ వాదులు వేరే పార్టీకి వలస వెళ్లే ఆలోచన మానుకొంటారు. ప్రజలలో కూడా కొంత సానుభూతి పెరుగుతుంది. ప్రభుత్వం మీద వుండే వ్యతిరేకతను మించి ఆ సానుభూతి వుంటే కాంగ్రెస్ పరిస్థితి మెరుగుపడుతుంది. రాష్ట్రం కంటే కరెంట్ కోతలు, అవినీతి, పెట్రోల్ ధరల వంటి జీవన పరమైన అంశాలకు ప్రాధాన్యత ఇస్తే ఆ ప్రయోజనం సిద్ధించక పోవచ్చు. అయితే జగన్ మాత్రం ఏ ప్రాంతంలో అడ్రస్ లేకుండా పోతాడు. మరొకప్రక్క టిడిపి కూడా అదే దుర్గతి ఎదుర్కొంటుంది. తెలంగాణ ఇచ్చిన తర్వాత ఎన్నికలు జరిగితే పోటీ కాంగ్రెస్, టిఆర్ఎస్‌ల మధ్యనే వుంటుంది తప్ప వేరే పార్టీకి అవకాశం దొరకక పోవచ్చు. టిఆర్ఎస్ కార్యకర్తల బలం వున్న పార్టీ కాదు. అందువల్ల దాన్ని సులభంగా అధిగమించవచ్చునన్నది కాంగ్రెస్ వ్యూహం.

అయితే ఇదే స్థాయిలో ఆంధ్ర ప్రాంతంలో కాంగ్రెస్ నష్టపోతుంది. ఇప్పటికే ఆ పార్టీ పట్ల, ప్రభుత్వం పట్ల ప్రజలలో ఏవగింపు వుంది. ప్రత్యేక రాష్ట్రంతో అది రెట్టింపు అవుతుంది.

కొరవ 14వ పేజీలో



● కలెక్టర్, ఎస్పీలవి....

# రాజకీయ బదలీలే!

నెల్లూరు జిల్లా కలెక్టర్ శ్రీధర్, ఎస్పీ రమణకుమార్ ఒకేసారి బదలీ అయ్యారు. పంచాయితీ ఎన్నికల నోటిఫికేషన్‌కు ఒక రోజు ముందు హడావుడిగా జరిగిన బదలీలలో వీరిద్దరికి స్థాన చలనం జరిగింది. ఒక జిల్లాకు చెందిన కలెక్టర్, ఎస్పీలను ఒకేసారి బదలీ చేయడం అరుదైన విషయం. వీరి బదలీ పరిపాలనా సౌలభ్యం కోసం జరిగింది కాదని, రాజకీయ అవసరాల కోసం చేసిందని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు.

ఎస్పీగా రమణకుమార్ వచ్చిన రోజు నుంచీ జిల్లా మంత్రి ఆనం రామనారాయణ రెడ్డి అసంతృప్తితో నలిగి పోతున్నాడు. గతంలో నేదురుమల్లి జనార్దన్‌రెడ్డి, నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి, సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి వంటివారు మంత్రులుగా ఉన్నప్పుడు వారి అనుమతి లేకుండా ఎస్పీ, కలెక్టర్లను నియమించేవారు కారు. బారెడు పొడుగు శరీరం, ఊరంతటికీ వినిపించే గొంతు ఉన్నప్పటికీ తానాస్థాయికి చేరుకోలేక పోయానన్న మనోవేదన మంత్రిని బాధ పెట్టింది. అయితే ఎస్పీ రమణకుమార్‌కు డిజిపి ఆశీర్వాదం వుండడం, ముఖ్యమంత్రి కూడా రామనారాయణరెడ్డికి పరోక్ష నియంత్రణ వుండాలన్న ధోరణి అవలంభించడం వల్ల రెండేళ్ల పాటు ఆయన దుంప తెంచలేక పోయాడు రామనారాయణ రెడ్డి. అప్పటికీ ఆనం వివేకానందరెడ్డి వీలు దొరికినప్పుడల్లా ఎస్పీ మీద కారాలు మిరి

కొరవ 14వ పేజీలో

# వ్యాపారం లేని రాజకీయమా?

కాంగ్రెస్ పార్టీ జాతీయ ప్రధాన కార్యదర్శి, రాష్ట్ర పరిశీలకుడు, మధ్యప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి దిగ్విజయ్ సింగ్ ఒక దివ్య సందేశం విన్పించి వెళ్లాడు. రాజకీయ నాయకులు వ్యాపారాలకు దూరంగా వుండాలనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడాయన. ఆయన ఉద్దేశ్యం స్పష్టం. వ్యాపారాన్ని, రాజకీయాన్ని కలగా పులగంగా నడుపుతున్న వైఎస్ జగన్‌కు సుతిమెత్తటి హితవు అది. జగన్‌కు దిగ్విజయ్ సింగ్‌కు వున్న సంబంధాలు, స్నేహాలు పక్కన పెడితే ఆయన చెప్పిన సూక్తి మాత్రం సమకాలీన రాజకీయాలలో చర్చ జరపవలసిన అంశం అనడంలో వివాదం లేదు.

స్వతంత్రం వచ్చిన తర్వాత భారత రాజకీయాలు పెను మార్పులకు గురైనాయి. జవహర్ లాల్ నెహ్రూ తరం మొత్తం ఆ పోరాటం నుంచి వచ్చింది కావడంతో సిద్ధాంత వైరుధ్యాలు తప్ప, నవభారతాన్ని ఎట్లా నిర్మించాలనే భావనలో అభిప్రాయభేదాలు తప్ప స్వంత ఆలోచన వుండేది కాదు. రాజకీయం అంటే ప్రజలకు సేవ చేసే అవకాశంగా మాత్రమే చూశారు అందరూ. పంచాయతీ సర్పంచ్ నుంచి అదే పోకడ. ఇందిరమ్మ వచ్చిన తర్వాత రాజకీయాలలో పదవీలాలసత, అవకాశ వాదం పెరిగింది. డబ్బు అవసరం హెచ్చింది. దానితో రాజకీయవాదులకు వ్యాపారులకు సంబంధాలు మొదలైనాయి. కానీ ఆమె ఏనాడు కూడా రాజకీయ నేతలను దగ్గరకు తీశారేతప్ప, వ్యాపారులను అక్కున చేర్చుకోలేదు. పైగా ఆమె తరంలో కమ్యూనిస్టుల ప్రభావం సమాజం మీద విస్తృతంగా వుండేది. రాజీవ్‌గాంధీ తరంతో రాజకీయాలు, వ్యాపారాలు కలసిపోయాయి. ఆయన అంతేవాసులుగా మెలిగిన వారందరూ డూన్ స్కూల్ నుంచి, వ్యాపార నేపథ్యం నుంచి వచ్చినవారే. రాజకీయవాదులు పదవీ కాంక్షతో కొట్టుమిట్టాడుతున్నారు కాబట్టి, పారిశ్రామిక రంగంలోని వారైతే డబ్బు సంపాదన మీద మోజు లేకుండా ప్రభుత్వంలో తనకు సహకరిస్తారనే భావనతో అమితాబ్ బచ్చన్ వంటి వారిని తన పక్కన పెట్టుకొన్నాడు; అప్పటి నుంచి భారత రాజకీయాలకు చెదలు పట్టింది. రాజకీయం అంటే డబ్బు అనే సూత్రం ప్రబలిపోయింది. ఎన్నికలలో గెలవడానికి డబ్బు కావాలి, గెలిచిన ప్రక్కక్షణం నుంచి దానికి రెట్టింపు సంపాదించాలి అనేది సిద్ధాంతంగా మారింది. కాంట్రాక్టర్లు, స్మగ్లర్లు, బ్యాంకులను ముంచిన వారు, మద్యం వ్యాపారులు, గూండా గిరితో కోట్లు కూడబెట్టిన వారు, భూ ఆక్రమణదారులు..... ఇట్లా సకల సబ్బండు సమాజ పీడ కులూ రాజకీయాలలోకి వచ్చేశారు. అన్ని పార్టీలూ వారికే టిక్కెట్లు ఇస్తున్నాయి. వారే గెలుస్తున్నారు. రాజకీయాన్ని వృత్తిగా కుటుంబ వారసత్వంగా స్వీకరించినవారు వీరితో పోటీ పడలేక, వారి దారినే నడిచి, అడ్డదారిలో సంపాదించడం అలవాటు చేసుకొన్నారు. రాజకీయం మొత్తం భ్రష్టుపట్టిపోయింది. మన రాష్ట్రం నుంచి లోక్‌సభకు గెలిచిన 42 మంది ఎమ్పీలలో వ్యాపార నేపథ్యం లేనివారు పట్టుమని పది మంది కూడా లేరు. తిక్కవరపు సుబ్బరామరెడ్డి, లగడపాటి రాజగోపాల్, మోదుగుల వేణుగోపాల్‌రెడ్డి, కావూరి సాంబశివరావు, మేకపాటి రాజమోహన్‌రెడ్డి, వైఎస్ జగన్, రాయపాటి సాంబశివరావు, మాగుంట శ్రీనివాసులు రెడ్డి... ఇట్లా చెప్పుకొంటూపోతే జాబితా అనంతం.

గొంగడిలో అన్నం తింటూ వెంట్రుకలు ఏరిన చందంగా రాజకీయాలలో వున్నవారు వ్యాపారాలకు దూరంగా మెలగాలని హితవు చెప్తున్నాడు దిగ్విజయ్ సింగ్. నవ్వుకోవడానికి తప్ప ఆ సిద్ధాంతం ఎందుకూ కొరగాదు. వ్యాపారం ఒక్క జగన్‌కు పరిమితమై లేదు. ఒక్క పార్టీ ఒక్క రాజ్యసభ స్థానాన్ని వ్యాపారులకు కాకుండా రాజకీయాలలో మెలిగిన వారికి ఇవ్వగల్గిన స్థితి వుందా ఈ రోజు?

అయితే వ్యాపారాలు చేసే వారిని రాజకీయ పదవులలోకి రాకుండా చేయాలన్న వాదన మాత్రం సమర్థనీయమైనది. వ్యాపారం కోసమే లోక్‌సభ సభ్యులుగా గెలుస్తున్నారు. గెలిచిన ప్రక్క క్షణం నుంచే తమ వ్యాపార అవసరాలకు మాత్రమే పదవిని వాడుతున్నారు. దానివల్లనే శాసన సభలో కానీ, పార్లమెంట్‌లో కానీ ప్రజా సమస్యలు మరుగునపడి పోతున్నాయి. చర్చలు, వాదనలు కనుమరుగైపోతున్నాయి. వ్యాపార అవసరాలు మాత్రమే ముందు వరసలో నిలుస్తున్నాయి. ఈ పోకడ దేశానికి ఎనలేని కీడు చేస్తున్నది. వైఎస్ జగన్‌కు సలహా ఇచ్చే ముందు ఆ మాటేదో సోనియాగాంధీకి చెప్పి, రేపటి లోక్‌సభ టిక్కెట్ల పంపకంలో వ్యాపారులను పక్కన పెట్టించగలిగితే దిగ్విజయ్‌సింగ్ హితవు దేశానికి ఉపకరిస్తుంది.

జమీన్‌రైతు

## జనవాణి

### ఆరోజుల్లో... పంచాయితీ ఎన్నికలు!

పంచాయితీ ఎన్నికల నగారా మ్రోగింది. ఇప్పటి పంచాయితీ ఎన్నికలకు అప్పటి పంచాయితీ ఎన్నికలకు ఎంతో తేడా ఉంది. 1953 మార్చి 18వతేది మన జిల్లాలో జరిగిన పంచాయితీ ఎన్నికల్లో సిపిఐ సర్పంచ్ అభ్యర్థులుగా నేను చౌకచర్లలో, జక్కా వెంకయ్య దామరమడుగులో పోటీ చేశాం. ఆ రోజుల్లో జనం బహిరంగంగా గ్రామసభలో చెయ్యెత్తి సర్పంచ్‌ను ఎన్నుకోవాలి. భూస్వాములను ఎదిరించి చౌకచర్లలో 465 మంది బహిరంగంగా నావైపు చేతులెత్తి నిలబడ్డారు. నేను 124ఓట్ల తేడాతో ఓడిపోయాను. ఇప్పటి ఎన్నికలు డబ్బు, మద్యం, కులం ప్రక్షాన నిలుస్తున్నాయి. ప్రజాసేవంటే అర్ధమే మారిపోయింది. 1953లో సిపిఐ అభ్యర్థులుగా మా ఎన్నిక గూర్చి 'జమీన్‌రైతు'లోనూ స్వర్గీయ శ్రీరామమూర్తిగారు ప్రత్యేక వార్త వ్రాశారు. అప్పటి ఎన్నికల తీరు ఇప్పటి వారికి తెలియాలనే ఈ ఉత్తరం వ్రాశాను.

కూనపరెడ్డి వెంకటసుబ్బయ్య — హైదరాబాద్

### న్యాయమూర్తులు అభినందీయులు!

ఇటీవల కావలిలోని సీనియర్ సివిల్ జడ్జి, జూనియర్ సివిల్ జడ్జి, జ్యూడిషియల్ ఫస్ట్‌క్లాస్ మెజిస్ట్రేట్లు తెలుగు భాషలో కోర్టు తీర్పులు ప్రకటించారు. దీనికిగాను ఆ న్యాయమూర్తులకు అభినందనలు. ఈ ముగ్గురు న్యాయమూర్తులను స్ఫూర్తిగా తీసుకొని రాష్ట్రంలోని అందరు న్యాయాధిపతులు తెలుగులోనే తీర్పులు ప్రకటించాలని కోరుచున్నాను. అంతేగాక ప్రజలకు తెలియని ఆంగ్లభాషలో సాక్షుల వాంగ్మూలాలను వ్రాయడం మానుకొని తెలుగుభాషలో వాంగ్మూలాలను నమోదు చేయాలి. దీనికిగాను ప్రభుత్వం తెలుగు టైపు మిషన్లను అన్నీ కోర్టులకు సప్లై చేయాలి. ఈ వ్యవహారంలో అధికార భాషా సంఘం అధ్యక్షుడు మండలి బుద్ధ ప్రసాద్ చొరవ చూపమనవి.

వి.వి. నరసింహాచార్యులు — కావలి

### శ్రీకృష్ణ దేవరాయలుపై వ్యాసం బాగుంది!

జూన్ 21వతేది 'జమీన్‌రైతు' సంచికలో పాయసం సుబ్రహ్మణ్య మహర్షి వ్రాసిన 'శ్రీకృష్ణదేవరాయల ఔన్నత్యాన్ని విడిచి కులాన్ని గూర్చి రచ్చ చేస్తున్నారు' వ్యాసం బాగుంది. సాహితీ సమరాంగ సార్వభౌముడు రాయల కులప్రస్తావన ఘోరం. ఈ రోజుల్లో జనం కుల గజ్జితో రగలిపోతున్నారు. మతాలు, కులాలు, వర్గాలు స్వార్థ రాజకీయ నాయకులు, బతికేందుకు కొందరు నేతలు ఏర్పచుకొన్న మార్గాలు. తెలుగు భాషకు ఎనలేని సేవ చేసిన మహనీయుడు శ్రీ కృష్ణ దేవరాయలును ఇటువంటి వ్యవహారాలకు దూరంగా ఉంచితేనే మంచిది. ఈ విషయాన్ని సరైన రీతిలో చెప్పిన పాయసం సుబ్రహ్మణ్యమహర్షికి ధన్యవాదాలు.

కొడవలూరు ప్రసాద్ — గూడూరు

## 70 ఏళ్ల క్రితం ఈవారం

9-7-1943
పేజీలు : 4 వెల: 0-1-6

### నెల్లూరు ముచ్చట్లు

#### నాటకాల పిచ్చి

పల్లెల్లో నాటకాల పిచ్చి ప్రబలి పోయింది. మేనేజింగ్ కమిటీ అనే పేరుతో ఒక కాంట్రాక్టు బృందం బయలు దేరడం, సావిత్రో, హరిశ్చంద్రో యేదో ఒకటి వేయడము, టిక్కెట్లు బాధించి అమ్మడం, చివరకు నాటకం రుచించక పోవడము, కాంట్రాక్టుదార్లకు నెత్తి అణగడము జరుగుతున్నది. సాదృశ్యాలు కావాలంటే బోలెడు. ఇందుకూరుపేట చింతామణిలో పాతిక వెయ్యి చేయి తగిలింది. బుచ్చి నాటకాల్లో ఉద్యోగ విజయం– శివాజీలో రూ.450లులో లాభం. చివరకు బస్స్టాండులో కాఫీ హోటల్ సుబ్బిశెట్టి గూడా దమయంతి నాటకంలో రూ.400లు కాల్చుకున్నాడు. 25,600 కాఫీ కప్పులలో సంపాయించిన కాలణా లాభాలు ఒక్కనాడు సమర్పించి కూర్చున్నాడు. ఇట్లే చాలా చోట్ల జరుగుతున్నట్లు వార్తలొస్తున్నవి. కావున ధనాశతో కిరాయి నటకులను తెచ్చి నష్టపడకుందురని హెచ్చరిస్తున్నాము.

#### రేబాల లత్సయ్య ధర్మాలు

నెల్లూరులో స్వర్గీయ రేబాల లత్సయ్య ధర్మాలు చాలా ఉన్నవి. ముఖ్యమైన వాటిలో ఒకటి అమెరికన్ ఆసుపత్రి వద్ద కట్టిన కొట్లు. దీని మేనేజ్‌మెంటు అంతా ఆసుపత్రి వారికే అప్పగించారు. వారు బాడుగలు తట్టుకుంటున్నారనేగాని దాని రిపేరుగానీ, ఇంప్రువ్‌మెంటుగానీ ఏమీ తల పెట్టడం లేదు. అందులో రెండు కొళాయిలుంటే అవి పని చేయడం లేదు. అక్కడున్న వారు నీటికైబడు ప్రయాస వర్ణనాతీతం. చివరికొక బావి గూడా లేదు ఆవరణంలో. మహారాజు ఆ పోలయ్య తప్పితే మరొకరు దాన్ని చూచిన పాపానబోరు. దాని పాలకులు ముందు ఆ నీటి విషయమై తగు శ్రద్ధ వహింతురుగాక.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

5-7-1963
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### ఆనం సంజీవరెడ్డి రాజీనామా

ఆంధ్ర ఇరిగేషన్, విద్యుచ్ఛాఖామాత్యులు, నెల్లూరు జిల్లాలో ఎదురులేని నాయకుడు అయిన ఏసి సుబ్బారెడ్డి గారి మీద కినుక వహించి; నెల్లూరు జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు, శాసనసభ్యుడు, జిల్లాలో ఏసికి కుడి భుజమైన ఆనం సంజీవరెడ్డి తన రెండు పదవులకు రాజీనామా యిచ్చి, ఆ రెండు పత్రాలను ఏసికి పంపి కామిరెడ్డిపాడుకు పోయి కూర్చున్నట్లు తెలుస్తున్నది.

ఈ వారంలో వాకాడు హాస్టలు రజతోత్సవ సభలకు హాజరు కావలసి వుండి కూడా ఈ కారణం వల్ల హాజరు కాలేదని గూడా తెలుస్తున్నది.

సంజీవరెడ్డి ఈ తీవ్ర నిర్ణయానికి కారణలేమిటో తెలియుట లేదు. అయితే వీరిరువురి మధ్య చాలాకాలంగా పెక్కు విషయములలో అభిప్రాయబేధాలు కలుగుతున్నవని, అవి తీవ్రం గావడం, కడకు అనేక విషయాలలో ఏసి సుబ్బారెడ్డి గారే సర్దుకొని పోవడం జరుగుతుండినట్లు అప్పుడప్పుడు వినిపిస్తుండినది. ఇప్పుడు ఈ కినుకకు, రాజీనామాకు ఆత్మకూరు తాలూకాలోని ఒక చెరువు కాంట్రాక్టు విషయంలో సంజీవరెడ్డి అభీష్టాన్ని ఏసి నెరవేర్చక పోవడమని అంటున్నారు.

ఈ కాంట్రాక్టు ముందు ఒక సేవా సంస్థకు ఇవ్వబడి, తర్వాత సంజీవరెడ్డి గారి ప్రవేశం పిమ్మట అది రద్దు చేయబడి, మరొక సంస్థకు యివ్వబడిందని, కానీ దీనికి సంబంధించి మరొక విషయంలో అభిప్రాయ బేధాలు కలిగి ఘర్షణ పడ్డారని విషయజ్ఞులంటున్నారు.

# నెల్లూరు ముచ్చట్లు

## రంగారెడ్డి కలెక్టర్‌గా శ్రీధర్‌రెడ్డి!

'జమీన్‌రైతు'లో గతవారం చెప్పినట్లుగానే పాత కలెక్టర్ బండాత్మకూరు శ్రీధర్‌రెడ్డి రంగారెడ్డి జిల్లా కలెక్టర్‌గా నియమితులయ్యారు. ఈ నియామకంలో కలెక్టర్ సహాధ్యాయి అయిన ముఖ్యమంత్రి సోదరుడు, మాజీ హోం మంత్రి సబితా ఇంద్రారెడ్డి సహకరించారట. సంతృప్తిగానే నెల్లూరు నుంచి వెళ్తున్నట్లు శ్రీధర్‌రెడ్డి 'జమీన్‌రైతు'కు చెప్పారు.

## రాష్ట్ర విభజనను ఒప్పుకోను!

రాష్ట్ర విభజనకు తాను వ్యతిరేకినని నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి స్పష్టం చేశారు. హైదరాబాద్‌లో రాష్ట్ర కాంగ్రెస్ వ్యవహారాల ఇన్‌ఛార్జ్ దిగ్విజయ్‌సింగ్‌తో భేటీ అనంతరం మీడియాతో మాట్లాడారు. రాష్ట్రాన్ని సమైక్యంగా ఉంచాలన్న కోరిక గట్టిగా ఉన్నవాడ్ని. రాష్ట్రాన్ని విభజిస్తే సవాలక్ష సమస్యలు ఉత్పన్నమవుతాయని వివేకానందరెడ్డి తేల్చి చెప్పారు.

## జిల్లా జడ్జి పదవీ విరమణ!

జిల్లా జడ్జి ఎల్.శ్రీరామమూర్తి జూన్ 30వ తేది పదవీ విరమణ చేశారు. ఈ సందర్భంగా న్యాయశాఖ ఉద్యోగులు కోర్టు ప్రాంగణంలో ఆయన్ను సన్మానించారు. ఈ సందర్భంగా తాత్కాలిక జిల్లా జడ్జి జగదీష్‌చంద్రరావు మాట్లాడుతూ మూడేళ్లుగా జిల్లా జడ్జిగా పనిచేసిన శ్రీరామమూర్తి అందరి ఆదరాభిమానాలు పొందారని చెప్పారు. ఈ కార్యక్రమంలో న్యాయమూర్తులు వెంకటరమణ, ఆనంద్, మధుసూధన్‌రావు, మురళీ మోహన్‌రెడ్డి, న్యాయశాఖ ఉద్యోగుల సంఘం నేతలు పి.వి.నారాయణరెడ్డి, జానకి ప్రసాద్, శివయ్య, రమణయ్య తదితరులు పాల్గొన్నారు.



## చెన్నైకు తెలుగు గంగ నీరు!

కండలేరు రిజర్వాయర్ నుంచి చెన్నైకు తాగునీటి అవసరాలు తీర్చను నీటిని 1వ తేది విడుదల చేశారు. నెల రోజులపాటు ఈ నీటిని విడుదల చేస్తామని డిఇఇ సుబ్రహ్మణ్యం చెప్పారు. ఈ నీళ్లు చెన్నై చేరను వారం పడుతుందన్నారు. గత 18 ఏళ్లుగా చెన్నైకు కండలేరు ప్రాజెక్ట్ నుంచి నీటిని విడుదల చేస్తున్నామన్నారు.

**చందాదారులకు మనవి**

- చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.
- మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.
- 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా Onlineలో ఆంధ్రాబ్యాంక్, విఆర్‌కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.
- చెక్కులు స్వీకరించబడవు.

జీవిత చందా రూ.1000/-

సంవత్సర చందా
స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

జమీన్‌రైతు
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190

## పిఎస్ఎల్వీ సి-22 ప్రయోగం విజయవంతం!

శ్రీహరికోటలోని షార్ అంతరిక్ష కేంద్రం నుంచి 1వ తేది రాత్రి 11.41 నిమిషాలకు పిఎస్ఎల్వీ సి-22 రాకెట్ ద్వారా ప్రయోగించిన ఇండియన్ రీజనల్ నేవిగేషన్ శాటిలైట్ సిస్టం ప్రయోగం విజయవంతమయ్యింది. విపత్తు సమయంలో ఈ నేవిగేషన్ శాటిలైట్ అద్భుత సేవలందిస్తుంది. రాత్రిపూట షార్ నుంచి రాకెట్ ప్రయోగం ఇదే తొలిసారి.

## వీర తాగబోతుల నెల్లూరు!

నెల్లూరీయులు మద్యపాన సేవనంలో రికార్డులు బ్రద్దలు చేస్తున్నారు. 2011-12 అబ్కారీ ఆర్థిక సంవత్సరంలో 648 కోట్ల రూపాయల మద్యం తాగిన నెల్లూరోళ్లు 2012 – 13 ఆర్థిక సంవత్సరంలో 829 కోట్ల రూపాయల మద్యం తాగారు. అంటే గత ఏడాదికన్నా 181 కోట్ల రూపాయలు ఎక్కువ తాగారన్నమాట. ఈ యేడు ఎన్నికలు కూడా ఉండడంతో పాత రికార్డులన్నీ బద్దలు కావడం ఖాయమని చెప్పొచ్చు.

## వంకి పెంచలయ్యకు డాక్టరేట్!

ఆదిశంకర విద్యా సంస్థల ఛైర్మన్ వంకి పెంచలయ్యకు తిరుపతిలోని వెంకటేశ్వర విశ్వవిద్యాలయం డాక్టరేట్ ప్రకటించింది. 'ఫ్యాక్షనిజం అండ్ హ్యూమన్ రైట్స్ ఇన్ ఆంధ్రప్రదేశ్' అనే అంశంపై వంకి పెంచలయ్య సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించారు. ఆచార్య కె.శ్రీనివాసరావు మార్గదర్శకత్వంలో ఈ పరిశోధన కొనసాగింది.

## డాక్టర్ సిఎంకె రెడ్డికి లండన్‌లో సన్మానం!

నెల్లూరీయుడు చెన్నైలో తిరుగులేని సర్జన్‌గా పేరుగాంచిన డాక్టర్ సిఎంకెరెడ్డి సేవలను లండన్ బ్రిటీష్ సౌత్ ఇండియా ఛాంబర్ ఆఫ్ కామర్స్ గుర్తించి ఆయనకు లైఫ్ టైమ్ అచీవ్‌మెంట్ అవార్డును ప్రకటించింది. ఈ అవార్డు లండన్‌లోని హౌస్ ఆఫ్ పార్లమెంట్‌లో 27వ తేది బ్రిటన్ పార్లమెంట్ సభ్యుడు వీరేంద్రశర్మ డాక్టర్ సిఎంకెరెడ్డికి అందించారు. గొప్ప అవార్డును అందుకొని నెల్లూరు ప్రతిష్ట పెంచిన డాక్టర్ సిఎంకెరెడ్డికి మా అభినందనలు.



## 90వ కలెక్టర్ బాధ్యతల స్వీకరణ!



నెల్లూరు జిల్లా 90వ కలెక్టర్‌గా నాగులపల్లి శ్రీకాంత్ 2వ తేది కలెక్టరేట్‌లో పాత కలెక్టర్ బండాత్మకూరు శ్రీధర్‌రెడ్డి నుంచి బాధ్యతలు స్వీకరించారు. ఉదయం 10.55 నిమిషాలకు తన ఛాంబర్‌లోనికి చేరుకున్న ఆయన కలెక్టరేట్ పరిపాలనాధికారి మధుసూధన శర్మ సిద్ధంగా ఉంచిన పత్రాలపై సంతకాలు చేసి తన సీట్లో కూర్చున్నారు. జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం, ఎజెసి పెంచలరెడ్డి, డిఆర్వో రామిరెడ్డితోపాటు వివిధ శాఖలకు చెందిన జిల్లా అధికారులు ఆయనకు పుష్పగుచ్ఛాలు అందించి శుభాకాంక్షలు చెప్పారు.

అనంతరం ఆయన మీడియాతో మాట్లాడుతూ ఎంతో చరిత్ర గలిగిన నెల్లూరు జిల్లాకు కలెక్టర్‌గా రావడం గర్వంగా ఉందన్నారు. చైతన్యవంతమైన ఈ జిల్లా అభివృద్ధికి తనవంతు కృషి చేస్తానన్నారాయన. 1998లో ఐఎఎస్‌కు ఎంపికైన కలెక్టర్ శ్రీకాంత్ స్వస్థలం కాకినాడ. ఎంటెక్ చదివిన ఆయన ఐఎఎస్‌కు ఎంపికయ్యాక కరీంనగర్ అసిస్టెంట్ కలెక్టర్‌గా తన ఉద్యోగ ప్రస్థానం మొదలు పెట్టారు. మదనపల్లి సబ్ కలెక్టర్‌గా, పాడేరు ఐటిడిఏ పిఓగా, గోదావరి పుష్కరాల ప్రత్యేకాధికారిగా, టిటిడి జెఇఓగా, విశాఖపట్నం కమిషనర్‌గా, శ్రీకాకుళం కలెక్టర్‌గా, రాజీవ్ ఆరోగ్యశ్రీ ట్రస్ట్ సిఇఓగా విభిన్న ఉద్యోగ బాధ్యతలు నిర్వర్తించి నెల్లూరుకు కలెక్టర్‌గా నియమితులయ్యారు. బాధ్యతలు స్వీకరించేందుకు ముందు ఆయన నెల్లూరీయుల ఆరాధ్యదైవం తల్పగిరి రంగనాథస్వామిని పూజించారు.

## డ్యూటీకి జడ్పీ సిఇఓ!

గత నెల రోజులుగా సెలవులో ఉన్న జడ్పీ సిఇఓ వీరభద్రయ్య 27వ తేది తిరిగి విధుల్లో చేరారు. పంచాయితీ ఎన్నికల శిక్షణ నిమిత్తం హైదరాబాద్‌కు వెళ్లిన ఆయన 24 గంటల కడుపునొప్పి రావడంతో అక్కడే ఆసుపత్రిలో చేరి శస్త్ర చికిత్స చేయించుకొన్నారు.

## సెలవుపై కమిషనర్

కార్పొరేషన్ కమిషనర్‌గా ఇటీవలే బాధ్యతలు చేపట్టిన శ్యాంసన్ దీర్ఘకాలిక సెలవుపై వెళ్లారు. గతంలో కమిషనర్‌గా వున్న ఆంజనేయులు పదవీ విరమణ చేయడంతో ఆయన స్థానంలో శ్యాంసన్ వచ్చారు. బాధ్యతలు చేపట్టిన తర్వాత రోడ్డు ప్రమాదం జరగడంతో ఆస్పత్రిలో చికిత్స పొందారు. కానీ వెన్నునొప్పి అధికం కావడం, ఇంట్లో స్వల్ప అగ్నిప్రమాదం జరగడం లాంటివి ఆయన కుటుంబ సభ్యులు అశుభ సంకేతాలుగా భావించినట్లు సమాచారం. దీంతో ఆయన దీర్ఘకాలిక సెలవుపై వెళ్లాడు. ఇన్‌ఛార్జ్ బాధ్యతలు మునిసిపల్ ఇంజనీర్ సంపత్ కుమార్‌కు అప్పగించారు. సాధారణంగా నెల్లూరొచ్చిన ఏ అధికారీ బదిలీపై వెళ్లడానికి ఇష్టపడరు. అలాంటిది కమిషనర్‌కు మాత్రం నెల్లూరు ఎందువల్లో అచ్చిరాలేదు.

## బిజెవైఎంలో ముక్కు రాధాకృష్ణ!

భారతీయ జనతా యువమోర్చా (బిజెవైఎం) రాష్ట్ర కార్యవర్గ సభ్యునిగా ముక్కు రాధాకృష్ణ గౌడ్ నియమితుల

కొరవ 14వ పేజీలో

# మూడు విడతలుగా పంచాయితీ ఎన్నికలు!

## జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం వెల్లడి



సమీక్షా సమావేశంలో జాయింట్ కలెక్టర్.

జిల్లాలో మూడు విడతలుగా పంచాయితీ ఎన్నికల నిర్వహణకు అధికార యంత్రాంగం సన్నద్ధమవుతుంది. దీనికిగాను జూన్ 27వ తేది కలక్టరేట్‌లో జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం అధికారులతో ఒక సమీక్షా సమావేశం నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ మొదటి దఫా పంచాయితీ ఎన్నికలు ఆత్మకూరు, కావలి డివిజన్లలో, రెండవ విడతగా నెల్లూరు, మూడవ విడతగా గూడూరు, నాయుడుపేటలలో జరుగుతాయన్నారు. దీనికిగాను 8988 పోలింగ్ స్టేషన్లు, 3700 బ్యాలెట్ బాక్సులు సిద్ధం చేశామన్నారు. రిటర్నింగ్, అసిస్టెంట్ రిటర్నింగ్ అధికారులను నియమించామని వీరికి జూలై 2వ తేది నుంచి ఆర్డీఓల నేతృత్వంలో శిక్షణా తరగతులు నిర్వహిస్తామన్నారు. రెండు వందల ఓట్లు ఉండే పోలింగ్ కేంద్రంలో ఒక ప్రిసైడింగ్ అధికారి, ఓ పోలింగ్ క్లర్క్, 200 నుంచి 400 ఓట్లుండే కేంద్రంలో ఇద్దరు పోలింగ్ క్లర్కులు, ఒక ప్రిసైడింగ్ అధికారి, 400 కంటే పైన ఓట్లున్న చోట ఒక ప్రిసైడింగ్ అధికారి, ముగ్గురు పోలింగ్ క్లర్కులను నియమించనున్నట్లు చెప్పారు. సమస్యాత్మక గ్రామాల్లో వెబ్ కాస్టింగ్, వీడియో గ్రాఫర్, సూక్ష్మ పరిశీలకుడు, మొబైల్ స్ట్రైకింగ్ ఫోర్స్ ఉంటాయన్నారు. ఎమ్పీడిఓ ఆఫీసుల్లో బ్యాలెట్ల పేపర్ల పంపిణీ కేంద్రాలు ఏర్పాటు చేస్తామని, గ్రామ పంచాయితీ కార్యాలయాల్లోనే కౌంటింగ్ ఉంటుందన్నారు.

## విద్యాశాఖ టాస్క్‌ఫోర్స్‌లో హెడ్‌మాస్టర్లు!

ప్రైవేటు పాఠశాలల తనిఖీ కోసం జిల్లా విద్యాశాఖ ఆధ్వర్యంలో ఏర్పాటుచేసిన టాస్క్‌ఫోర్స్ కమిటీల్లో హెడ్మాస్టర్లను నియమించారు. జిల్లావ్యాప్తంగా ఈ బృందం తనిఖీలు చేయాల్సి రావడంతో హెచ్ఎంలు విధులు నిర్వహించే పాఠశాలల్లో ఇబ్బందులు ఏర్పడుతున్నాయి. ప్రస్తుతం అన్ని ప్రభుత్వ పాఠశాలల్లో వివిధ తరగతుల్లో ప్రవేశాలు పొందుతారు. అలాగే పదవతరగతి ఉత్తీర్ణత పొందిన వారికి బదలీ ధృవీకరణ పత్రాలు జారీ చేయాల్సి వుంటుంది. పాఠశాలల్లో జారీ చేసే అన్నీ ధృవీకరణ పత్రాల్లో హెడ్మాస్టర్లు తప్పనిసరిగా సంతకం  చేయాలి. టాస్క్‌ఫోర్స్ బృందంలో వున్న వారంతా ప్రైవేటు పాఠశాలల తనిఖీలకు వెళ్లడంతో విద్యార్థులు, తల్లిదండ్రులు రోజుల తరబడి పాఠశాలల చుట్టూ తిరుగుతున్నారు. పాఠశాలల్లో ప్రవేశం పొందాలన్నా, బదలీ సర్టిఫికేటు తీసుకెళ్లాలన్నా హెడ్మాస్టర్ పాఠశాలలో అందుబాటులో వుండక తప్పదు. విద్యాశాఖాధికారులు మాత్రం ఈ విషయం గుర్తించకపోవడం విశేషం. పాఠశాల తనిఖీలకు శ్రీకారం చుట్టి అనుమతిలేని వాటిని, నిబంధనలు పాటించని వాటిని సీజ్ చేశారు.

# బిజెపి క్యాడర్‌లో ఉత్సాహం!

## నెల్లూరుకు జాతీయ, రాష్ట్ర నాయకులు



సమావేశంలో మాట్లాడుతున్న వెంకయ్యనాయుడు.

నగరంలో ఇటీవల బిజెపి జెండాలు రెపరెపలాడడం, వివిధ కార్యక్రమాల పేరుతో స్థానిక నేతల నుంచి రాష్ట్రస్థాయి, జాతీయస్థాయి నేతలు నగరానికి రావడంతో చాన్నాళ్లకు బిజెపి కార్యకర్తలు, అభిమానులు సంతోషించారు. గతంలో బిజెపి నగరంలో గట్టి క్యాడర్‌ను కల్గి ఉండేది. నేతల మధ్య గ్రూపులు, గొడవలతో పూర్తిగా భ్రష్టుపట్టించి పారేశారు. నాయకుల వైఖరితో విసిగిపోయిన పలువురు కార్యకర్తలు వివిధ పార్టీల్లో చేరగా, మరికొందరు పార్టీ కార్యక్రమాలకు దూరంగా వుంటున్నారు. ఈ పరిస్థితులలో బిజెపి రాష్ట్ర అధ్యక్షుడు కిషన్‌రెడ్డి తిరిగి పార్టీని బలోపేతం చేసేందుకు చర్యలు చేపడుతున్నారు. దీనిలో భాగంగా రాష్ట్ర కమిటీలో జిల్లా నుంచి అధిక సంఖ్యలో అవకాశం కల్పించడంతో పాటు వివిధ కార్యక్రమాలలో పాల్గొనేందుకు ఆ పార్టీ జాతీయ నేత వెంకయ్య నాయుడుతో కలసి పాల్గొంటూ కార్యకర్తలను ఉత్సాహ పరుస్తున్నారు. దీంతో పార్టీ క్యాడర్‌లో కొత్త ఉత్సాహం మొదలైంది. కార్యకర్తల సమావేశం, సంతాప సభల్లో పాల్గొనేందుకు కిషన్‌రెడ్డి, వెంకయ్యనాయుడు, సిక్కిం మాజీ గవర్నర్ రామారావు తదితర సీనియర్ నేతలు నగరానికి విచ్చేశారు. ఈ సందర్భంగా వారు కార్యకర్తలకు దిశానిర్దేశం చేశారు. రాష్ట్ర ప్రభుత్వ తీరు, కేంద్ర ప్రభుత్వ వ్యవహారశైలిపై తనదైనశైలిలో విమర్శలు గుప్పించిన నేతలు రానున్న ఎన్నికల్లో నరేంద్రమోడి సారథ్యంలో ఎన్నికల్లో సత్తాచాటాలని, బిజెపి జెండాను రెపరెపలాండించాలని పిలుపునిచ్చారు. ఎన్నికల్లో ఫలితాల మాట ఎలా వున్నా పార్టీ శ్రేణుల్లో చురుకు కల్గించేందుకు ఎన్నో ఏళ్ల తర్వాత నాయకులు చొరవ చూపడం పట్ల ఆ పార్టీ అభిమానులు, సానుభూతి పరులు హర్షం వ్యక్తం చేస్తున్నారు.

● పొలిటికల్ ఫోర్స్‌గా

# విద్యాశాఖలో టాస్క్‌ఫోర్స్!

## మామూళ్ల వసూళ్లకే పరిమితం

విద్యాలయాల్లో ప్రభుత్వ నిబంధనల అమలు, తీరుతెన్నులపై సమీక్షించను జిల్లా విద్యాశాఖ టాస్క్ ఫోర్సును ఏర్పాటు చేసింది. వినడానికి ఇది బాగానే ఉన్నా దీని వ్యవహారశైలి ప్రారంభంలోనే విమర్శల పాలవుతోంది. ప్రభుత్వం నిర్దేశించిన నిబంధనలకు అనుగుణంగా పాఠశాల ఏర్పాటు చేయడంతోపాటు, ఆట స్థలం, పాఠశాల బోధనకు అర్హతగల వారిని నియమించుకోవాలి. ఇలాంటి వాటన్నింటినీ పాటిస్తేనే ప్రభుత్వ గుర్తింపు లభిస్తుంది ఆయా పాఠశాలలకు. కానీ జిల్లాలోని ప్రైవేట్, కార్పొరేట్ పాఠశాలల్లో భూతద్దం పెట్టి వెతికినా ఈ నిబంధనలు పాటించే పాఠశాలలు కన్పించవు. ఏదో ఒకటి రెండు పాఠశాలలు మాత్రమే వుంటాయి. ఈ సంగతి విద్యాశాఖాధికారుల నుంచి సిబ్బంది వరకు తెలుసు. దీనిని అవకాశం చేసుకుని అందినంత దండకాలు చేస్తుంటారు. గుర్తింపు కోసం, రెన్యువల్స్ ఇతరత్రా అవసరాల నిమిత్తం వచ్చే కరస్పాండెంట్లు బంగారు బాతుల్లా కన్పిస్తారు వీరికి. ఈ నేపథ్యంలో స్కూళ్ల తనిఖీకి టాస్క్‌ఫోర్స్ పేరుతో ఒక బృందాన్ని ఏర్పాటు చేయడం, తనిఖీలు జరిపించడం బాగానే వున్నా అందులో రాజకీయాలు చోటుచేసుకోవడంతో టాస్క్‌ఫోర్స్ ఒక ఫాల్సులా మారింది. ఇటీవల జిల్లాలో కొన్ని విద్యా సంస్థలపై దాడులుచేసి, వాటిని మూయించి వేయడం వెనుక ఒక ప్రజాప్రతినిధి హస్తం వున్నట్లు ఆరోపణలు వస్తున్నాయి. జిల్లా విద్యాశాఖాధికారికి ఆయన ఎంత చెప్తే అంతని, ఆయన మాటను తూచ తప్పకుండా అమలు చేస్తాడన్న విషయం పలువురు పలు సందర్భాలలో విమర్శించి వున్నారు. దీనికి తగినట్లు స్కూళ్లపై దాడులు చేయడం, నేతల నుంచి ఫోన్‌రాగానే వెనక్కు వచ్చేయడంతోపాటు నిబంధనల బూచి చూపి అందినంత దండుకొంటున్నారనే విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. కొందరు సిబ్బంది పాఠశాలల యాజమాన్యాలకు ఫోన్‌చేసి విద్యాశాఖాధికారి కోపంగా వున్నారు, స్కూలు మూసివేయమంటున్నారు ఏంది సంగతి? అని బెదిరించి పెద్ద మొత్తంలో దండకాలు చేస్తున్నట్లు ఆరోపణలు వస్తున్నాయి.

# ఉచిత పుస్తకాల పంపిణీలో కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి!

## బుజబుజ నెల్లూరులో ప్రారంభం



పుస్తకాల పంపిణీలో కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి బృందం.

నెల్లూరు రూరల్ నియోజకవర్గంలో వేల మంది పేద విద్యార్థులకు ఉచితంగా పుస్తకాలను పంపిణీచేసే కార్యక్రమాన్ని కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి ప్రారంభించారు. జూన్ 27వ తేది బుజబుజ నెల్లూరులోని శివాజీకాలనీలోని ప్రభుత్వ పాఠశాలలో ఉచిత పుస్తకాల పంపిణీ కార్యక్రమాన్ని ప్రారంభించిన శ్రీధర్‌రెడ్డి మాట్లాడుతూ నియోజకవర్గంలోని పేద విద్యార్థులకు చేయూతనివ్వాలనే ఉద్దేశ్యంతో ఈ పథకాన్ని ప్రారంభించామని చెప్పారు. రాజకీయ పార్టీలు జిందాబాద్‌లు, డౌన్‌డౌన్‌లకు మాత్రమే పరిమితం కాకూడదని, రాజకీయ పార్టీలు విమర్శలకు వేదికలుగా మారకూడదని, రాజకీయ పార్టీలంటే ప్రజల గుండెచప్పుడుకు ప్రతిరూపంగా పని చేయాలన్నారు. ఎన్నికల సమయంలో మాత్రమే రాజకీయాలు చేయాలని మిగతా వేళల్లో అధికారంలో ఉంటే ఆ అధికారం ద్వారా ప్రజలకు ఉపయోగపడాలని, అధికారం లేకుంటే ప్రజా సమస్యల పరిష్కారానికి ఉద్యమాలు, వీలైనన్ని సేవా కార్యక్రమాలు చేపట్టాలని అప్పుడు మాత్రమే రాజకీయ పార్టీలపై ప్రజలకు గౌరవం వస్తుందన్నారు. నెల్లూరు రూరల్ నియోజకవర్గంలో ఉచిత వైద్య శిబిరాలు, విపత్తు ప్రమాద బాధిత కుటుంబాలకు సహాయం, రక్తదాన శిబిరాలు నిర్వహించామన్నారు. ఉచిత పుస్తకాల పంపిణీలో తనకు చేదోడుగా ఉన్న ఎన్ఎండి చారిటబుల్ ట్రస్ట్ అధినేత నిజాముద్దీన్‌ను శ్రీధర్‌రెడ్డి ఈ సందర్భంగా అభినందించారు. ఈ కార్యక్రమంలో వైకాపా నెల్లూరు రూరల్ మండల కన్వీనర్ పిగిలాం నరేష్, ప్రశాంత్ కిరణ్, నజీర్‌బాషా, రామకృష్ణయాదవ్ తదితరులు పాల్గొన్నారు.

# మెడికల్ సీట్ల మాఫియా!

## లక్షలాది రూపాయలు వసూలు

విద్యార్థుల కోరిక, తల్లితండ్రుల ఆశయాన్ని అవకాశంగా చేసుకొని మెడికల్ సీట్లు ఇప్పిస్తామంటూ దళారులు దోచుకు తింటున్నారు. ఎంసెట్‌లో మంచి ర్యాంకులు రాక, ఎలాగైనా మెడిసిన్‌లో చేరాలని విద్యార్థులు, తమ పిల్లలను అప్పు చేసైనా డాక్టర్ కోర్సు చేయించాలని తల్లితండ్రులు ఉబలాటపడుతుండడంతో పుట్టగొడుగుల్లా కన్సల్టెన్సీలు వెలుస్తున్నాయి. తమిళనాడు, కర్ణాటక, ఉత్తరప్రదేశ్ తదితర రాష్ట్రాల్లో పేరొందిన మెడికల్ కాలేజీల్లో చేర్పిస్తామంటూ కొందరు దళారులు పుట్టుకొచ్చారు. విద్యార్థులకంటే వారి తల్లితండ్రులు పడుతున్న ఆందోళనను తన సంపాదనకు అవకాశంగా చేసుకొని అరచేతిలో వైకుంఠం చూపిస్తున్నారు. లక్షల రూపాయలు ఫీజులతోపాటు కమిషన్‌ను దండుకొనేందుకు రకరకాల ఆశలు పెడుతూ తల్లితండ్రులకు టోకరా వేస్తున్నారు. అడ్వాన్సుగా నాలుగైదు లక్షలు తీసుకొని తర్వాత ఇదిగో అదిగో అంటూ సీట్లు ఇప్పించకుండా తిప్పుకొంటుండడంతో తమ బిడ్డలను డాక్టర్లుగా చూడాలన్న ఆశతో అప్పుచేసి లక్షల రూపాయలు కట్టేందుకు సిద్ధపడిన తల్లితండ్రులు తీవ్ర మానసిక ఒత్తిడికి గురౌతున్నారు. ఈ దళారులు కొందరు కన్సల్టెన్సీలను ఏర్పాటు చేసుకోగా, మరికొందరు ప్రైవేటు సంస్థలలో పనిచేస్తూనే ఇళ్ల వద్ద తమ కార్యకలాపాలు కొనసాగిస్తూ అందినంత దోచుకొంటున్నారు. ఇలాంటివారు నగరంలో కోకొల్లలుగా వున్నారట. ఇటీవల తోటపల్లి గూడూరు మండలానికి చెందిన వారు తమ పిల్లలను మెడిసిన్‌లో చేర్పించేందుకు ఒక దళారిని ఆశ్రయించి పెద్ద మొత్తంలో నగదును అడ్వాన్సుగా చెల్లించారట. ఆ మహిళా దళారి చెప్పాపెట్టకుండా తీర్థయాత్రలకు వెళ్లడం, ఆమె సమాచారం తెలియకపోవడంతో వారు పడిన ఆందోళన అంతా ఇంతా కాదు. చివరకు ఆమె క్షేమంగా వుందని తెలుసుకోవడంతో వారు ఊపిరి పీల్చుకొన్నారు. అలాగే నగరంలో ప్రైవేట్ కళాశాలల్లో పనిచేసేవారు కొందరు ఇలాగే దళారుల అవతారం ఎత్తి విద్యార్థుల భవిష్యత్తుతో చెలగాటమాడుతున్నారు. ఇలాంటివారి పట్ల విద్యార్థులు, తల్లితండ్రులు అప్రమత్తంగా వ్యవహరించాల్సి వుంది.

# వెంకటగిరిలో కొమ్మి ప్రజాదీవెన యాత్ర!

నియోజకవర్గ కేంద్రమైన వెంకటగిరి మండలంలో మొదటిసారిగా వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ నియోజకవర్గ సమన్వయకర్త కొమ్మి లక్ష్మయ్యనాయుడు ప్రజాదీవెన యాత్రను చేపట్టారు. మండల పరిధిలోని వర్ధనపల్లి, అమ్మపాళెం తదితర గ్రామాల్లో ఈయాత్ర కొనసాగింది. ఈ సందర్భంగా కొమ్మి లక్ష్మయ్యనాయుడు మాట్లాడుతూ పేదలకోసం తపించి వారి అభ్యున్నతికి పాటుపడిన నేత వైఎస్ రాజశేఖర్‌రెడ్డి అని కొనియాడారు. రైతులకు ఉచిత విద్యుత్, పేదవిద్యార్థులకు ఉన్నత చదువులు, కార్పొరేట్ వైద్యం, రేషన్ కార్డులు, అర్హులకు పక్కాఇళ్లు, వృద్ధులకు, వికలాంగులకు, వితంతువులకు ఫించన్లు మంజూరు చేసి వారి హృదయాల్లో చిరస్థాయిగా నిలచిపోయాడన్నారు. ఆ మహానేత

### జనం బాగా వచ్చారు

తనయుడు వైఎఎస్ జగన్ ప్రజలకు మంచి పాలన అందించడానికి పరితపిస్తున్నాడని తెలిపారు. అలాంటి వ్యక్తిని ముఖ్యమంత్రిని చేస్తేనే వైఎస్ ప్రవేశపెట్టిన పథకాలు పక్కాగా అమలవుతాయని, కొత్త పథకాలు రూపొందుతాయన్నారు. నియోజకవర్గంలోని అన్ని ప్రాంతాలలో ప్రజాదీవెన యాత్ర చేపడుతామని తెలిపారు. ఈ సందర్భంగా తెలుగుదేశం పార్టీకి చెందిన గున్నారెడ్డివర్గం కొమ్మి సమక్షంలో వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీలో చేరారు. అలాగే ఉపాధిహామీ కూలీలు, వర్ధన్నపల్లికి చెందిన ప్రజలు తమ సమస్యలను పరిష్కరించాలని కొమ్మిని కోరారు.

● అర్హులకు

## త్వరితగతిన రుణాలు!

అర్హులైన లబ్ధిదారులందరికి రుణాలు అందించేందుకు తగిన చర్యలు చేపడుతున్నట్లు జిల్లా లీడ్ బ్యాంక్ మేనేజర్ వెంకటేశ్వర్లు తెలిపారు. ఇటీవల వెంకటగిరి వచ్చిన ఆయన ఎంపిడిఓ కార్యాలయంలో అధికారులు, బ్యాంక్ మేనేజర్లతో సమీక్ష నిర్వహించారు. వెంకటగిరి, బాలాయపల్లి, డక్కిలి మండలాలకు చెందిన వారిని గ్రామసభల ద్వారా ఎంపికచేసి వారందరికి సత్వరమే రుణాలందేలా చూడాలన్నారు. ఎస్సీ కార్పొరేషన్, బిసి కార్పొరేషన్ ఈడిలు సోమయ్య, కోటేశ్వరరావులు మాట్లాడుతూ వెనుకబడిన తరగతుల వారీగా వ్యక్తిగత రుణాలను అందిస్తున్నామన్నారు. ఒక్కో యూనిట్‌కు 60వేల రూపాయలను అందిస్తామని, అందులో 30వేల సబ్సిడీతో రుణాలు ఇస్తామన్నారు. ఈ సమావేశంలో డక్కిలి, వెంకటగిరి ఎంపిడిఓలు సుస్మిత, శివప్రసాద్ తదితరులు పాల్గొన్నారు.

● కావలిలో

## డిఎంఅండ్‌హెచ్‌ఓ తనిఖీ!

### స్కానింగ్ సెంటర్ సీజ్

ప్రైవేట్ ఆస్పత్రులు ప్రభుత్వ నిబంధనలు ఉల్లంఘిస్తే ఉపేక్షించేది లేదని జిల్లా ఇన్‌ఛార్జ్ వైద్య ఆరోగ్య శాఖాధికారి డాక్టర్ జి.సుధాకర్ హెచ్చరించారు. ఆయన కావలి పట్టణంలోని ప్రైవేట్ ఆస్పత్రులను ఇటీవల తనిఖీ చేశారు. క్రిస్టియన్‌పేటలోని డాక్టర్ ప్రతాప్ ఆసుపత్రి రిజిస్ట్రేషన్ లేకుండా ఏర్పాటు చేయడం, స్కానింగ్ సెంటర్‌ను అనుమతి లేకుండా నిర్వహిస్తుండడాన్ని గుర్తించిన డిఎంహెచ్‌ఓ నిర్వాహకుడి గురించి వాకబు చేయగా ఆ వైద్యుడు పత్తా లేకపోవడంతో ఆస్పత్రిని సీజ్ చేశారు. అక్కడి నుండి పట్టణంలో గల వివిధ ఆస్పత్రులు, స్కానింగ్ సెంటర్లను ఆయన తనిఖీ చేశారు. డిఎంహెచ్‌ఓ తనిఖీకి వస్తున్నాడని సమాచారం అందుకొన్న పలువురు ప్రైవేట్ ఆస్పత్రి నిర్వాహకులు ఆందోళన చెందారు. ఈ సందర్భంగా వైద్యఆరోగ్యశాఖాధికారి సుధాకర్ మాట్లాడుతూ జిల్లాలోని అన్ని ప్రైవేట్ ఆస్పత్రులను తనిఖీ చేస్తామన్నారు. ఎవరైనా ప్రభుత్వ నిబంధనలు అతిక్రమించినట్లు వుంటే వారిపై చర్యలు తప్పవని హెచ్చరించారు.

## వైఎస్ కుటుంబంపై కక్ష సాధిస్తున్నారు!

జిల్లాపరిషత్ మాజీ ఛైర్మన్, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ సర్వేపల్లి నియోజకవర్గ సమన్వయకర్త కాకాణి గోవర్ధన్‌రెడ్డి ప్రజాదీవెన యాత్ర పేరిట నియోజకవర్గ పరిధిలో విస్తృతంగా పర్యటిస్తున్నాడు. తోటపల్లి గూడూరు, ముత్తుకూరు మండలాల్లో గడపగడపకు తిరిగి పార్టీ బలోపేతానికి కృషి చేయడంతోపాటు ప్రజలను చైతన్యపరుస్తున్నారు. ఇందులో భాగంగానే పొదలకూరు మండలంలోనూ ప్రజాదీవెన యాత్ర చేపట్టారు. పొదలకూరుతోపాటు చుట్టుప్రక్కల ప్రాంతాల్లో పర్యటించిన ఆయన కాంగ్రెస్ ప్రభుత్వం అవలంభిస్తున్న ప్రజావ్యతిరేక విధానాలను, ప్రతిపక్ష తెలుగుదేశం పార్టీ వ్యవహరిస్తున్న తీరును ఎండగడుతున్నాడు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి కాంగ్రెస్‌పార్టీని రెండుసార్లు అధికారంలోకి తీసుకొస్తే ఆయన మరణానంతరం వైఎస్ కుటుంబపై కక్షగట్టి వేధింపులకు గురిచేస్తున్నారని విమర్శించారు. పేదల గుండెచప్పుడు తెలిసిన వైఎస్ వారికి కార్పొరేట్ వైద్యం అందించేందుకు ఆరోగ్యశ్రీ పథకం ప్రవేశపెడితే, నేటి పాలకులు అందులో నుంచి 117 రోగాలను తీసివేసి ఆరోగ్యశ్రీని నిర్వీర్యం చేశారన్నారు. వైఎస్ జగన్‌కు ప్రజల్లో వున్న అభిమానాన్ని చూసి ఓర్వలేక కాంగ్రెస్, తెలుగుదేశంపార్టీలు కుమ్మక్కై రాజకీయాలు చేస్తున్నాయని దుయ్యబట్టారు. రానున్న ఎన్నికల్లో ఆరెండు పార్టీలకు తగిన గుణపాఠం చెప్పాలని, వైఎస్ జగన్‌ను ముఖ్యమంత్రి చేసే దిశగా ప్రజలు సహకారం అందించాలని అభ్యర్థించారు.



పొదలకూరులో మాట్లాడుతున్న గోవర్ధన్‌రెడ్డి.

# దేవుడి స్థలంలో మాంసం దుకాణం!

### గూడూరులో చోద్యం చూస్తున్న దేవాదాయశాఖ అధికారులు

గూడూరులో సాక్షాత్తు దేవుడికి సంబంధించిన భూముల్లో మాంసం అంగడి ఏర్పాటు చేసినా అటు దేవాదాయశాఖ అధికారులు గాని, ఇటు ఉన్నతాధికారులు పట్టించుకోకపోవడంపై విమర్శలు వస్తున్నాయి. గూడూరు పట్టణ పరిధిలో శ్రీ కోదండరామస్వామి ఆలయానికి వందలాది ఎకరాల భూములున్నాయి. రాముడి బ్రహ్మోత్సవాల సమయంలో పుట్ట బంగారం కోసం వినియోగించే భూమిలో ఏకంగా మాంసం దుకాణాన్ని ఏర్పాటు చేశారు. ఈ వ్యవహారంపై గగ్గోలు రేగింది. దేవుడి భూముల్లో మాంసం అంగడికి ఎలా అనుమతిస్తారని పలువురు ప్రశ్నిస్తున్నా దేవాదాయశాఖ అధికారులు, సిబ్బంది ఈ విషయం తెలియనట్లు వ్యవహరిస్తున్నారు. అంతేకాకుండా ఈ అంగడి కోసం పెద్ద మొత్తంలో బాడుగ కట్టించుకొంటూ రికార్డుల్లో మాత్రం నామమాత్రపు అద్దె వసూలు చేస్తున్నట్లు దొంగ లెక్కలు చూపిస్తున్నారట. ఈ వ్యవహారంలో ఇఓ, సిబ్బందికి భారీస్థాయిలో ముడుపులు అందినట్లు ఆరోపణలు వస్తున్నాయి. దాదాపు 150 ఎకరాల భూమి కోదండ రామునికి వున్నప్పటికీ ఆదాయం మాత్రం స్వల్పంగా వుంటుంది. కబ్జాదారులు పోలయ్యగుంట ప్రాంతంలో గల భూమిని ఆక్రమించిపారేయడం, మంచి వ్యాపార కూడళ్లలో నామమాత్రపు అద్దెకు అంగళ్లు ఇచ్చివేయడంతో అద్దె రూపంలో వచ్చే ఆదాయం స్వల్పంగా వుంటోంది. ఈ విధంగా 112 దుకాణాలను ఇచ్చి వున్నారు. ఆ ప్రాంతాల్లో మిగిలిన అంగళ్ల నుంచి 5 నుండి 15వేల రూపాయలు వసూలు చేస్తున్నారు వ్యాపారులు. ఇంతగా దేవుడి సొమ్ము దిగమింగి అక్రమాలకు పాల్పడుతున్న దేవాదాయ అధికారులు, సిబ్బందిపై చర్యలు చేపట్టాలని స్థానికులు కోరుకొంటున్నారు.



కోదండరామస్వామి ఆలయ స్థలంలో మాంసం దుకాణం.

## వరకవిపూడిలో భూ వివాదం!

### ● పట్టించుకోని అధికారులు

మాగాణి భూములను ఆనుకొని వున్న తాటి చెట్లను నరికివేయడంపై వరకవిపూడి గ్రామంలో వివాదం నెలకొనింది. ఈ గ్రామంలో ముస్లింల స్మశాన స్థలానికి ప్రహరీగోడ నిర్మించే విషయమై వున్న తాటిచెట్లను నరికివేయడం, ఇందుకు రాజకీయ అండదండలు వుండడంతో ఈ వివాదం రాజకీయ రంగు పులుముకొంది. గండవరపు రాజవర్ధన్ రెడ్డి, శివప్రసాద్‌రెడ్డిలకు ఇక్కడ ఆరెకరాల భూమి వుంది. దాని ప్రక్కనే ముస్లింల స్మశాన స్థలం వుంది. ఈ రెండింటికి మధ్య తాటిచెట్లు, వేపచెట్లు సరిహద్దుగా వున్నాయి. ఇసనాక రమేష్‌రెడ్డి అనే వ్యక్తి స్మశాన స్థలానికి ప్రహరీగోడ నిర్మించేందుకు హామీ ఇచ్చి వందకుపైగా వున్న తాటి చెట్లు, వేపచెట్లను జెసిబితో తొలగించనారంభించారు. ఈ చర్యలను భూములు గల రాజవర్ధన్‌రెడ్డి, ప్రసాదరెడ్డి అడ్డుకొన్నారు. దీనిపై స్థానిక పోలీసులకు ఫిర్యాదు చేసినా పట్టించుకోలేదని, రెవెన్యూ అధికారులకు చెప్పినా అందరు తమకు వ్యతిరేకంగా పని చేస్తున్నారని వారు ఆరోపిస్తున్నారు. ప్రహరీగోడ నిర్మాణంలోను ప్రజాప్రతినిధులు, వారి అనుచరులు జోక్యం చేసుకొని ఇబ్బందులకు గురి చేయడంతోపాటు ఎమ్మెల్యే ప్రభాకర్‌రెడ్డి, విజయడైరీ ఛైర్మన్ రంగారెడ్డి పేరు చెప్పి బెదరిస్తున్నారని వాపోయారు. ఇది ఎంతవరకు సమంజసమని భూముల యజమానులు ప్రశ్నిస్తున్నారు.

## కాంగ్రెస్, వైకాపాలు కవలపిల్లలు!

రాష్ట్రంలో రాజకీయ అనిశ్చితస్థితి ఏర్పడడానికి కాంగ్రెసే కారణమని సిపిఐ రాష్ట్రనేత, మాజీ ఎమ్మెల్యే రామకృష్ణ విమర్శించారు. ఇటీవల కావలి పట్టణానికి వచ్చిన ఆయన రాష్ట్ర రాజకీయాలపై స్పందించారు. కాంగ్రెస్ పార్టీ, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలు కవల పిల్లలని సంబోధించారు. కాంగ్రెస్ ప్రభుత్వం ప్రజావ్యతిరేక విధానాలను అవలంభిస్తుంటే, వైఎస్ ఆర్ కాంగ్రెస్‌పార్టీ ప్రజల సొమ్మును దోచుకతిన్న అవినీతిపార్టీ అని ఆరోపించారు. తండ్రి పదవిని అడ్డం పెట్టుకొని వైఎస్ జగన్ కోట్ల రూపాయలు దిగమింగి జైల్లో కూర్చొంటే, కొందరు సిగ్గులేని నేతలు జైల్లో ఆయన్ను కలసుకొని కండువాలు కప్పుకొంటున్నారని ఎద్దేవా చేశారు. వామపక్ష సారధ్యంలోని మూడో ఫ్రంటే దేశానికి ప్రత్యామ్నాయం అన్నారు. గుజరాత్‌లో వేలాది మంది మైనార్టీలను పొట్టన పెట్టుకొన్న మతోన్మాది మోడీని బిజెపి ఎన్నికల ప్రచార సారధిగా నియమించడం సిగ్గు చేటన్నారు. రానున్న ఎన్నికల్లో కాంగ్రెస్, వైఎస్ఆర్ కాంగ్రెస్, బిజెపి మినహాయించి మిగిలిన భావసారూప్య పార్టీలతో పొత్తుపెట్టుకొంటామని తెలిపారు. స్థానిక సంస్థల ఎన్నికలను సింబల్‌పైనే నిర్వహించాలని డిమాండ్ చేశారు.

### సిపిఐ నేత రామకృష్ణ విమర్శ



డాక్టర్స్ డేను పురస్కరించుకొని ఏసి స్టేడియంలోని స్పోర్ట్స్ అకాడమీ మహిళా క్రీడాకారిణులకు ఉచిత వైద్య పరీక్షలు చేస్తున్న డాక్టర్ ఎం.రమ.

# కాకాణి ప్రజాదీవెనకు ఆదరణ!

## ఈదూరులో సత్తాచూపిన టంగుటూరు సోదరులు

సర్వేపల్లి నియోజకవర్గంలో వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ ఆ నియోజకవర్గ సమన్వయకర్త కాకాణి గోవర్ధన్ రెడ్డి ప్రజాదీవెన యాత్ర పేరుతో కాలికి బలపం కట్టుకొని ఇంటింటికి తిరుగుతూ ప్రజలను కలుసుకొంటున్నాడు. వివిధ మండలాల్లో ఆయన యాత్ర కొనసాగుతుంది. ఈదూరు ప్రాంతంలో ఇటీవల కాకాణి జరిపిన ప్రజాదీవెన యాత్రను దిగ్విజయం చేయడంలో టంగుటూరు సోదరులు సత్తా చాటారు. ఆ ప్రాంతానికి గోవర్ధన్‌రెడ్డిని తీసుకవచ్చి ఆపార్టీ మండల కన్వీనర్ టంగుటూరు పద్మనాభరెడ్డి, మాజీ ఎంపిపి టంగుటూరు శ్రీనివాసులరెడ్డి ఘనంగా స్వాగతం పలికారు. రాజకీయపరంగా తొలి నుంచి టంగుటూరు సోదరులు ఇక్కడ బలం కల్గి వున్నారు. గత శాసనసభ ఎన్నికల సమయంలో వారు తమకున్న బలాన్ని తెలియజెప్పారు. అలాంటి సోదరులు ఆతర్వాత వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీకి దగ్గరై దాని బలోపేతానికి కృషి చేస్తున్నారు. వీరి స్వాగత సత్కారాలు చూసి కాకాణి ఉత్సాహం రెట్టింపైంది. ఈ కార్యక్రమంలో ఈదూరు ఆడపడుచు మాజీ మేయర్ పులిమి శైలజ, వైకాపా మహిళా విభాగం జిల్లా కన్వీనర్ బండ్లమూడి అనిత, తిక్కవరపు సనత్ కుమార్‌రెడ్డి, నెలవాయి రమేష్‌రెడ్డి, రమేష్ గౌడ్, హరి, సురేష్ రెడ్డి, తలమంచి శ్రీనివాసులు తదితరులు పాల్గొన్నారు.

● సురక్షితంగా

# కావలి చేరిన చార్‌ధామ్ యాత్రికులు!



కావలి నుంచి చార్‌ధామ్ యాత్రకు వెళ్లి ఘోర ప్రమాదంలో చిక్కుకొన్న 29మంది సురక్షితంగా తిరిగి వచ్చారు. మహాశివుడి దర్శనం కోసం కేధార్‌నాథ్, బద్రీనాథ్ తదితర పుణ్యక్షేత్రాల దర్శనానికి వెళ్లిన వారు వరదల కారణంగా వందలాది మంది మృత్యువాత పడడం, నీళ్లల్లో కొట్టుకొని పోవడం తెలిసిందే. ఈ ఘటనలో జిల్లా నుండి వెళ్లిన పలువురు యాత్రికులు చిక్కుకొన్నారు. నెల్లూరు, కావలి, బుచ్చి తదితర ప్రాంతాలకు చెందిన వారు క్షేమంగా తిరిగి స్వగ్రామాలకు చేరడంతో వారి బంధుమిత్రులు ఆనందానికి అవధులు లేకుండా పోయాయి. కావలి నుంచి వెళ్లిన వారు జూన్ 23న యశ్వంత్‌పూర్ – తిరుపతి రైల్లో సురక్షితంగా చేరుకొన్నారు. వారిని తోడ్కొని వెళ్లేందుకు బంధువులు, మిత్రులు పెద్దఎత్తున రైల్వేస్టేషన్‌కు చేరుకోవడంతో ఆనందం, ఉద్వేగం కలగలసిన వాతావరణం ఏర్పడింది. ఈ దుర్ఘటన గురించి పలువురు వివరిస్తూ కన్నీళ్లు పెట్టుకొన్నారు. తమ కళ్లముందే భవంతులు పేకమేడల్లా కూలిపోయాయని, పలువురు వరదల్లో కొట్టుకపోయారని చెబుతూ కన్నీరు కార్చారు. తిరిగి తమ వారిని కలుస్తామని అనుకోలేదని భగవంతుని కృపతో తిరిగి వీరందరిని చూడగలిగామంటూ ఉద్వేగానికి లోనయ్యారు. బిజెపి నేత కందుకూరి సత్యనారాయణ, సివిసి సత్యం తదితరులు స్టేషన్‌కు వచ్చి యాత్రికులకు స్వాగతం పలికారు.

● వెన్నుపోటుదారులు

# మేకపాటి సోదరులు!

## రాజన్నదళం విమర్శ

వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ నుంచి సస్పెన్షన్‌కు గురై రాజన్నదళంగా ఏర్పడి కలకలం సృష్టించిన మెట్టుకూరు చిరంజీవిరెడ్డి బృందం మరోసారి మేకపాటి సోదరులపై విరుచుకపడింది. వెన్నుపోటుదారులు మేకపాటి సోదరులేనని, వారికి మొదటి నుంచి కుయుక్తులు, కుట్రలతో దెబ్బతీసే అలవాటుందంటూ తీవ్రస్థాయిలో ధ్వజమెత్తారు. కలిగిరి ఆర్అండ్‌బి గెస్టుహౌస్‌లో వెంకటసుబ్బయ్య, కర్తం శ్రీనివాసులరెడ్డి తదితరులు విలేకరుల సమావేశం నిర్వహించి ఎంపి మేకపాటి రాజమోహన్‌రెడ్డి, ఉదయగిరి శాసనసభ్యుడు మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి వ్యవహారశైలిని దుయ్యబట్టారు. 2007, 2011లలో జరిగిన శాసనమండలి ఎన్నికల్లో పార్టీ అభ్యర్థులను వెన్నుపోటు పొడిచిన ఘనత శేఖర్‌రెడ్డిదని విమర్శించారు. అందుకే 2007లో ఆనాటి ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి కాంగ్రెస్‌పార్టీ నుంచి సస్పెండ్ చేశారని గుర్తు చేశారు. ఇటీవల జరిగిన డిసిఎంఎస్ ఎన్నికల్లోను సుమంత్‌రెడ్డితో మేకపాటి లాలూచీపడ్డారని ఈ వ్యవహారంలో పెద్ద మొత్తంలో చేతులు మారాయని వారు ఆరోపించారు. ప్రతి ఎన్నికల్లోను తమ శక్తిమేర ఖర్చు చేశామన్నారు. సొంతపార్టీకి వెన్నుపోటు పొడిచే మేకపాటి సోదరులు చిరంజీవిరెడ్డిని విమర్శిస్తే సహించేది లేదన్నారు. ఈ సమావేశంలో రాజన్నదళం సభ్యులు అమరజీవిరెడ్డి, శ్రీరాములు, గోవిందయ్య, చినఅంకిరెడ్డి, శివరామిరెడ్డి, కృష్ణారెడ్డి, సుబ్బారెడ్డి, వెంకటరమణయ్య, మాల్యాద్రి, రవీంద్రనాయుడు, కనకయ్య తదితరులు పాల్గొన్నారు.



# పేదవానికి కూలీగా రూ.224 ఇవ్వండి!

## ఉపాధి హామీ పథకం అధికారులకు చింతా ఆదేశం



పేదవాళ్లకు పని కల్పించే విషయమై ఎమ్పీ చింతామోహన్ చేసిన సూచనలకు అడ్డుపడ్డ ఏపిఎంపై ఆగ్రహం వ్యక్తం చేసిన ఘటన సూళ్లూరుపేట మండలంలో చోటు చేసుకొంది. మండల పరిధిలోని కుదిరి పంచాయితీలో ఉపాధిహామీ పనులు, ఇతరత్రా అభివృద్ధి పనుల విషయమై చింతామోహన్ అధికారులతో సమావేశం నిర్వహించారు. ప్రభుత్వ నిబంధనలకు అనుగుణంగా ప్రతి పేదవానికి రోజుకు 224 రూపాయలు కూలీ గిట్టుబాటు అయ్యేలా పని కల్పించాలని సిబ్బందికి సూచించారు. అక్కడే వున్న క్షేత్ర సహాయకుడు మధు ఎమ్పీ మాటలకు అడ్డు తగులుతూ అదేలా సాధ్యమవుతుందని, చేసిన పనికే సొమ్ము ఇవ్వగలమని అనడంతో చింతాకు కోపం తన్నుకొచ్చింది. అక్కడే వున్న అధికారులతో ఇతన్ని తీసేసి వేరొకరిని నియమించుకోవాలని అనడంతో వాతావరణం వేడెక్కింది. అనంతరం ఆయన సమావేశం కొనసాగిస్తూ ఉపాధి పనుల ట్రాక్టర్ల నిర్వహణలో దళితులకు అవకాశం కల్పించాలన్నారు. గ్రామీణ పారిశుధ్యంపై అధికారులు దృష్టిసారించాలన్నారు. ఉపాధి నిర్వహకులు, పంచాయితీ కార్యదర్శులు, వైద్య ఆరోగ్యశాఖ అధికారులు సమన్వయంతో పనిచేయాలన్నారు. అక్షరాస్యతతోనే అభివృద్ధి సాధ్యమని ఈ విషయాన్ని దృష్టిలో వుంచుకొని సంపూర్ణ అక్షరాస్యత సాధించేందుకు అవసరమైన చర్యలు చేపట్టాలన్నారు. ప్రజా పంపిణీ వ్యవస్థను జాగ్రత్తగా నిర్వహించాలని కోరారు. అమ్మహస్తం పథకం అమలుపై డీలర్లు, లబ్దిదారులతో సమీక్షించారు. ఈ సందర్భంగా మంచినీటి సరఫరా సక్రమంగా లేదని స్థానికులు తెలపగా అధికారులతో మాట్లాడిన చింతా సమస్య పరిష్కరానికి హామీ ఇచ్చారు. ఈ కార్యక్రమంలో ఎంపిడిఓ శివయ్య, ఎంఇఓ ఫణికుమార్, ఎమ్మార్వో రోజ్‌మాండ్, నీటి సరఫరా అధికారులు వెంకటేష్, ఉమామహేశ్వరి, కాంగ్రెస్ నాయకులు ఇసనాక హర్షవర్ధన్‌రెడ్డి, సుధాకర్‌రెడ్డి, ఈశ్వరయ్య, హనుమంతరావు, రాజశేఖర్‌రెడ్డి, రఘురామ్ తదితరులు పాల్గొన్నారు.

# మొండిదిన్నెపాళెంలో అగ్నిప్రమాదం!

కావలి రూరల్ మండలం అన్నెమడుగు పంచాయితీ మొండిదిన్నెపాళెం గ్రామంలో ఇటీవల జరిగిన అగ్ని ప్రమాదంలో సర్వం కోల్పోయి కట్టుబట్టలతో మిగిలిన బాధితులకు పలువురు సహాయసహకారాలు అందించి అండగా మేమున్నామన్న నమ్మకాన్ని కల్గించారు. రాత్రి వేళ జరిగిన అగ్ని ప్రమాదంలో పూరిళ్లు కాలి బూడిదయ్యాయి. దీంతో ఇక్కడ నివసిస్తున్న పేదలు నిరాశ్రయులయ్యారు. ఈ ఘటనపై పలు పార్టీల నేతలు, అధికారులు స్పందించి తక్షణ సహాయం అందజేశారు. వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ కావలి నియోజకవర్గ సమన్వయకర్త రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి ఆ గ్రామానికి వెళ్లి అగ్ని ప్రమాద బాధితులను ఓదార్చారు. ఘటనపై వివరాలు అడిగితెలుసుకొన్న ఆయన బాధితులకు 25వేల రూపాయలు ఆర్థిక సహాయం అందించారు. మాజీ ఎమ్మెల్యే విష్ణువర్ధన్‌రెడ్డి బాధితులను పరామర్శించి ప్రమాదం జరిగిన తీరును అడిగి తెలుసుకొని వారికి 10వేల రూపాయలు ఆర్థిక సహాయం అందజేశారు. ఆర్డీఓ సుబ్రహ్మణ్యేశ్వరరెడ్డి రెడ్‌క్రాస్ తరపున కిట్లను పంపిణీ చేశారు. దుస్తులు, స్టవ్వు, దోమతెరలు, వంట పాత్రలు అందజేశారు.

● ఉపాధి హామీతో

# గ్రామీణ ఆర్థిక వ్యవస్థ బలోపేతం!

ఉపాధిహామీ పథకం ద్వారా గ్రామీణ ఆర్థిక వ్యవస్థ గణనీయమైన అభివృద్ధి సాధించిందని తిరుపతి పార్లమెంటు సభ్యుడు చింతామోహన్ తెలిపారు. ఇటీవల ఆయన వెంకటగిరి మండలంలోని పారవోలు, లాలాపేట, సోమసానిగుంట తదితర గ్రామాల్లో పర్యటించారు. ప్రభుత్వ పథకాల అమలు తీరుపై సమీక్ష జరిపారు. రాష్ట్రప్రభుత్వం అమలు చేస్తున్న అమ్మహస్తం, గర్భిణులకు, చిన్నారులకు పౌష్టికాహారం వంటి పథకాల అమలు కారణంగా ప్రజల్లో మంచి స్పందన లభిస్తున్నాదన్నారు. ఉపాధిహామీ పనుల్లో జరుగుతున్న మస్టర్ల మాయాజాలాన్ని నియంత్రించాలని అధికారులను ఆదేశించారు. గ్రామాల్లో పారిశుధ్యం అధ్వాన్నంగా వున్న విషయాన్ని ప్రస్తావిస్తూ పది రోజులకోకసారి పదిమంది ఉపాధి కూలీలతో వీధులను శుభ్రం చేయించాలన్నారు. పొదుపు మహిళలను చైతన్యపరచి అధికసంఖ్యలో గ్రూపులను ఏర్పాటు చేసి వారికి బ్యాంక్‌ల ద్వారా రుణాలు ఇప్పించి స్వయం ఉపాధివైపు మహిళలను నడిపించాలని, కానీ దురదృష్టవశాత్తు ఐకెపి సిబ్బంది ఈ విషయంలో విఫలమయ్యారని అసంతృప్తి వ్యక్తం చేశారు. గ్రామస్తుల కోరిక మేరకు పారవోలు గ్రామంలో 5లక్షల రూపాయలతో సిమెంటురోడ్డు, చెరువు అభివృద్ధి పనులు, దళిత వాడలో ఓవర్‌హెడ్ ట్యాంక్ నిర్మాణాలకు హామీ ఇచ్చారు.




చార్‌ధామ్ బాధితుల కోసం తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు నారా చంద్రబాబు నాయుడుకు విరాళం అందిస్తున్న బుచ్చిరెడ్డిపాళెంవాసి టిడిపి రాష్ట్ర బిసి సెల్ కార్యదర్శి బత్తల హరికృష్ణ.

# చార్‌ధామ్ యాత్రికులను ఆదుకోవడంలో వైఫల్యం!

[redacted] వెంకటగిరి ఎమ్మెల్యే విమర్శ



ఉత్తరాఖండ్ వరద బాధితులను ఆదుకోవడంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఘోరంగా వైఫల్యం చెందాయని వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ విమర్శించారు. ఇటీవల వెంకటగిరి వచ్చిన ఆయన తన కార్యాలయంలో విలేకరులతో మాట్లాడారు. ఉత్తరాఖండ్ వరదల్లో చిక్కుకొన్న తెలుగువాళ్లను తిరిగి స్వస్థలాలకు చేర్చడంలో, వారిని ఆదుకోవడంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నాయన్నారు. రెండు చోట్ల కాంగ్రెస్ ప్రభుత్వం వుండి కూడా ఆపన్న హస్తం అందించకుండా పోవడం దారుణమైన విషయం అన్నారు. తమ పార్టీ అధినేత నారా చంద్ర బాబునాయుడు అక్కడకు వెళ్లి బాధితులను పరామర్శించడంతోపాటు ప్రత్యేక విమానం పెట్టి తీసుకవచ్చి ఆహార, వసతి సౌకర్యాలు కల్పించారన్నారు. విపత్కర పరిస్థితుల్లో బాధితులను ఆదుకోవడంలో కాంగ్రెస్ ప్రభుత్వం చేసిన నిర్లక్ష్యానికి ప్రజలు తగిన గుణపాఠం చెప్తారన్నారు.

● ఉదయగిరిలో

# అక్రమ లేఅవుట్ల హవా!

## జాగ్రత్త సుమా

ఉదయగిరి నియోజకవర్గంలోని వివిధ ప్రాంతాల్లో అక్రమ లేఅవుట్లు వెలుస్తున్నాయి. నియోజకవర్గ పరిధిలోని వింజమూరు, వరికుంటపాడు మండలాల్లో ఈ అక్రమ లేఅవుట్ల వ్యవహారం జోరుగా వుంది. వ్యాపారులు ప్రభుత్వానికి చెల్లించాల్సిన పన్నులు ఎగ్గొట్టి స్థానిక అధికారులను మచ్చిక చేసుకొని ఎడాపెడా లేఅవుట్లు వేస్తుండడంతో ప్రభుత్వ ఖజానాకు భారీగా గండి పడుతోంది. వ్యవసాయ భూములను ప్లాట్లుగా మార్చేసి నిబంధనలు తుంగలో తొక్కి అమ్మకాలు సాగిస్తున్నా పట్టించుకొనేవారే లేకుండాపోయారు. ఉదయగిరి, వింజమూరులలో కార్పొరేట్ పాఠశాలలు, ఇంటర్, డిగ్రీ కళాశాలలు, ఇంజనీరింగ్ కళాశాల వుండడంతో ఇటీవల కాలంలో భూముల ధరలకు రెక్కలొచ్చాయి. దీనిని దృష్టిలో వుంచుకొని వ్యాపారాభివృద్ధి కోసం అక్రమంగా లేఅవుట్లు వేసి అమ్మేస్తున్నారు. ఇరువూరు, వేంపాడు, తిమ్మారెడ్డిపల్లి ప్రాంతాల్లో ఇవి అధికంగా వున్నాయి. రెవెన్యూ పంచాయితీ అధికారులకు తెలిసినా వ్యాపారులతో వున్న లాలూచీ కారణంగా ఆ వైపే కన్నెత్తి చూడడం లేదన్న ఆరోపణలు వ్యక్తం అవుతున్నాయి.

# బోగోలు చెరువును త్రవ్వేస్తున్నారు!

## చెంచులక్ష్మీపురం రోడ్డు నిర్మాణం కోసం...

బోగోలు పంచాయితీపరిధిలో వేసే రోడ్డు పనులకు చెరువు మట్టిని త్రవ్వి వినియోగిస్తున్నారంటూ ఫిర్యాదులు వస్తున్నాయి. ఈ పంచాయితీలోని చెంచులక్ష్మీపురం గ్రామంలో ఆరులక్షల రూపాయలతో గ్రావెల్ రోడ్డు నిర్మించేందుకు నిధులు మంజూరై పనులు చేపట్టారు. ఈ పని దక్కించుకొన్న కాంట్రాక్టర్ నిబంధనల ప్రకారం గ్రావెల్ రోడ్డు నిర్మించకుండా బోగోలు చెరువులోని మట్టిని యంత్రాలతో త్రవ్వి తీసుకవచ్చి తూతూమంత్రంగా నిర్మిస్తుండడంతో గ్రామస్తులు అడ్డుకొన్నారు. వాస్తవానికి కడనూతల గ్రామం నుంచి గ్రావెల్ తేవాల్సి వుంది. ఆ పని చేయకుండా బోగోలు చెరువు నుంచి మట్టిని త్రవ్వి రోడ్డు వేస్తున్నారని స్థానికులు ఆరోపిస్తున్నారు. మండల అధికారులకు, పంచాయితీ అధికారులకు బిజెపి కిసాన్‌మోర్చా ఉపాధ్యాయుడు బొద్దులూరి జనార్ధన్‌రావు, టి.రవీంద్ర నాయుడు, స్థానికులు ఫిర్యాదు చేశారు. దీనిపై వారు ఎలా స్పందిస్తారో చూడాలి.

# వల్లివేడు బెటాలియన్ బెస్ట్

## డిఐజి అజయ్‌కుమార్

బెటాలియన్ సిబ్బంది విధి నిర్వహణలో అప్రమత్తంగా వ్యవహరించాలని కాకినాడ రేంజ్ బెటాలియన్స్ డిఐజి అజయ్‌కుమార్ సూచించారు. ఇటీవల ఆయన వెంకటగిరి బెటాలియన్‌ను పరిశీలించారు. వివిధ విభాగాలను తిరిగి చూసిన ఆయన అక్కడి సిబ్బందితో మాట్లాడారు. సిబ్బంది విధి నిర్వహణతోపాటు క్రమశిక్షణకు ప్రాధాన్యమివ్వాలన్నారు. బెటాలియన్‌లో జరుగుతున్న అభివృద్ధిపై సంతృప్తి వ్యక్తం చేశారు. బెటాలియన్ నిధులతోపాటు రాష్ట్రప్రభుత్వం ఉపాధిహామీ, ఉద్యానశాఖ నిధులతో చేపట్టిన తోటల అభివృద్ధి రాష్ట్రంలోని అన్ని బెటాలియన్లకు ఆదర్శమని ప్రశంసించారు. సిబ్బంది సంక్షేమం కోసం అమలు చేస్తున్న కౌన్సిలింగ్, గ్రీవెన్స్ డే, ప్రత్యేక విహార యాత్రలు మంచి సాంప్రదాయమన్నారు. ఈ కార్యక్రమంలో బెటాలియన్ డిఎస్పీలు ప్రసాద్, సుబ్బన్న, మనోహర్ తదితరులు పాల్గొన్నారు.




# విద్యకు చేయూత!

## వదాన్యులు సిద్దారెడ్డి భూదేవమ్మ దంపతులు

వాకాడు మండలం అందలమాలకు చెందిన శిరసనంబేడు సిద్దారెడ్డి, భూదేవమ్మ దంపతులు మండలంలోని విద్యార్థులకు ప్రోత్సహకాలు, పాఠశాలల అభివృద్ధికి సొంత నిధులు ఖర్చు చేస్తున్నారు. ఇందులో భాగంగానే ఈ ఏడాది మండల పరిధిలో కొత్తగా పాఠశాలల్లో చేరుతున్న విద్యార్థిని, విద్యార్థులకు పలకలు, బలపాలు అందజేశారు. అలాగే అందలమాల పాఠశాలలో పిల్లలకు మంచినీటి సౌకర్యం కల్పించేందుకు గాను బోరును ఏర్పాటు చేసేందుకు ముందుకు వచ్చారు. ఈ దంపతులు చేస్తున్న సేవను మండల అభివృద్ధి అధికారిణి ప్రమీలారాణి అభినందించారు. విద్యార్థులకు ఆసరాగా నిలుస్తూ విద్యాభివృద్ధికి సిద్దారెడ్డి, భూదేవమ్మ దంపతులు విశేష కృషి చేస్తున్నారని మండల విద్యాధికారి బాబు ప్రశంసించారు. భూదేవమ్మ ఈ సందర్భంగా విద్యార్థులను, ఉపాధ్యాయులను ఉద్దేశించి మాట్లాడుతూ భావి భారత పౌరులైన పిల్లలకు విద్యతోపాటు చక్కని క్రమశిక్షణ, నడవడిక నేర్పించాలన్నారు. విద్యార్థులు గురుశిష్యుల సంబంధాన్ని గుర్తెరిగి నడచుకోవాలన్నారు. ఈ కార్యక్రమంలో ప్రధానోపాధ్యాయుడు రాధాకృష్ణ, సీతారామయ్య తదితరులు పాల్గొన్నారు.

● శుభాలు చేకూర్చే

# సంకటహర చతుర్థీ వ్రతం!

చేపట్టే కార్యక్రమాలు ఎలాంటి ఆటంకాలు లేకుండా నిర్విఘ్నంగా జరగాలని, తలపెట్టిన పనులు విజయవంతం కావాలని ముందుగా గణ నాధుడిని ప్రధమంగా ప్రార్థించడం పరిపాటి. గణపతి ఆశీస్సులుంటే ఎంతటి పనైనా ఎలాంటి ఇబ్బందులు కలుగకుండా సులభంగా జరిగిపోతుందని నమ్మకం. అందుకోసం వినాయకుడిని పూజిస్తుంటాం. ప్రత్యేకించి భాద్రపద శుద్ధ చవితినాడు వినాయక చవితిని జరుపు కొంటాం. ఇది కాకుండా మానసిక ప్రశాంతత కోసం, రుణ బాధలు, కుటుంబ సమస్యలు, గ్రహ పీడల నుంచి విముక్తి పొందేందుకు, విఘ్నాలు తొలగి విజయాలు చేకూ రేందుకు ప్రత్యేకంగా సంకట హర గణపతి వ్రతం ఆచరి స్తుంటారు. ప్రతి మాసంలో వచ్చే సంకట హర చతుర్థి నాడు విఘ్నేశ్వరుని అర్చించినట్లయితే సర్వసంకటాలు తొలగుతాయని, కార్యసిద్ధి లభిస్తుందని శాస్త్రాలు చెబు తున్నాయి.

పురాణ, ఇతిహాస కాలం నుంచి విఘ్నేశ్వరునికి విశేష ప్రాధాన్యత వుంది. సకల దేవతా గణాలకు అధి నాయకుడు, విఘ్నాలకు అధిపతి అయిన గణేషుని పూజిస్తే సకల శుభాలు కల్గుతాయని పురాణాల్లో వివరించబడి వుంది. వినాయకుడనే పదానికి విశిష్టమైనవాడని, నాయ కుడు లేని వాడు అనగా తనకు తానే నాయకుడని అర్థం వుంది. గణాలకు అధిపతి అయిన గణపతి, జ్ఞానానికి అధిదేవత అని రుగ్వేదంలో వివరించబడి వుంది. వినాయ కునికి రోగాలను హరించే శక్తి వుందని, మనసులలోని చెడును హరించి మంచిని పెంపొందించేవాడని, సకల శుభాలు కలుగజేస్తాడని బ్రహ్మాప్రవర్త పురాణం, గణేశ పురాణం, స్కాంద పురాణం, శివ పురాణాల్లో వివరించి వుంది.

ప్రతి మాసంలో వచ్చే బహుళ చతుర్థి సంకటహర చతుర్థి అంటారు. ఆనాడు ఏకార్యం తలపెట్టినా ఆటం కాలు ఎదురౌతున్నా, అనుకొన్న పనులు అనుకొన్నట్లు జరుగకపోయినా, సమస్యలు ఎదురౌతున్నా, సంకటహర గణపతి వ్రతం ఆచరించడం వలన విఘ్నాలు తొలగి అను కొన్న పనులు నెరవేరుతాయని పురాణాలు చెబుతు న్నాయి. సంకట విమోచన వ్రతం చేసేవారు పొద్దునే స్నానమాచరించి శుచియై విఘ్నేశ్వరుని పూజించాలి. ఆనాడంతా ఉపవాసం వుండి సాయంత్రం గుడికి వెళ్లి గణనాధుని దర్శించుకొని గరికపై ప్రమిదను వుంచి దీపా రాధాన చేయాలి. గరిక, పూలు, పత్రితో విఘ్నేశ్వరుని పూజించి ఉండ్రాళ్లు నివేదన చేసి ఆ ప్రసాదాన్ని స్వీకరిం చాలి. ఈ వ్రతాన్ని చేపట్టడం వలన కష్టాలు, సమస్యలు తొలగి శుఖశాంతులు లభిస్తాయని విజయం సిద్ధిస్తుందని గణేశపురాణంలో వివరించబడింది.

నిరసన దీక్ష

● పోరుబాటన

# కాంట్రాక్టు లెక్చరర్లు!

**ప్రభుత్వ జూనియర్ కళాశాలల్లో కాంట్రాక్ట్ ప్రాతిపదికన పని చేస్తున్న లెక్చరర్లు దీర్ఘకాలికంగా పరిష్కారానికి నోచని తమ సమస్యలు పరిష్కరించాలని కలెక్టరేట్ వద్ద నిరాహార దీక్షలు చేస్తున్నారు.**



కాంట్రాక్ట్ లెక్చరర్ల దీక్షా శిబిరంలో మాట్లాడుతున్న శాసనమండలి సభ్యుడు విఠపు బాలసుబ్రహ్మణ్యం.

ప్రభుత్వ జూనియర్ కళాశాలల్లో కాంట్రాక్టు ప్రాతిపదికన పని చేస్తున్న లెక్చరర్లు గత పదిరోజుల నుంచి జిల్లా కలెక్ట రేట్ ఎదుట నిరాహారదీక్షలు చేస్తున్నారు. ఇప్పటికే కళాశాలలు ప్రారం భమై విద్యార్థులకు క్లాసులు చెబుతున్నారు. కాంట్రాక్టు ప్రాతిపదికన నియమితులైన వారు నిరాహారదీక్షల్లో పాల్గొనడంతో పాఠ్యాంశాలు బోధించేవారు కరువయ్యారు. ఉద్యోగ భద్రతను కల్పించాలన్న ప్రధాన డిమాండ్‌తో సమ్మె చేస్తున్నారు. 2000 సంవత్సరం నుండి 142, 143 జిఓ ద్వారా కాంట్రాక్టు ప్రాతిపదికన నియామకాలకు ప్రభుత్వం శ్రీకారం చుట్టింది. వాస్తవానికి పబ్లిక్‌సర్వీస్ కమిషన్ ద్వారా లెక్చరర్లు నియా మకం జరగాలి. కానీ ప్రభుత్వం కాంట్రాక్టు, అవుట్‌సోర్సింగ్ నియామ కాలకు గతపదేళ్ల నుంచి అధిక ప్రాధాన్యత కల్పిస్తూ వస్తుంది.

కాంట్రాక్టు లెక్చరర్ల నియామకం చాలా పకడ్బందీగా జరిపేవారు. ప్రతి ప్రభుత్వ కళాశాలల్లో ఒక త్రిసభ్యకమిటీని ఏర్పాటు చేసేవారు. సబ్జెక్టు నిపుణుడు, ఇద్దరు ప్రిన్సిపాళ్లు లెక్చరర్లను ఇంటర్వ్యూ చేసేవారు. పోస్టుగ్రాడ్యుయేషన్‌లో సాధించిన మార్కుల శాతాన్ని ఆధారం తీసు కొనేవారు. తర్వాత వారితో తరగతులు నిర్వహింప చేసి ఎంపిక చేసే వారు. ఈ విధానాన్ని 2005 సంవత్సరం వరకు ప్రభుత్వం కొనసాగిం చింది. 2005 సంవత్సరం నుంచి రోస్టర్ ఆధారంగా రీజనల్ జాయింట్ డైరెక్టర్ ఎంపిక చేసిన లెక్చరర్లను వివిధ కళాశాల్లో నియమించేవారు. వీరికి ప్రతికూలంగా రాష్ట్రప్రభుత్వం కొన్ని నిబంధనలను రూపొందించి అమలు చేయాలని నిర్ణయించింది. ఏడాదిలో 7నెలలు లేదా 8నెలలు మాత్రమే పని చేయించుకొని జీతం మాత్రం అదే ఏడాదిలో కొన్ని నెలలు, మరుసటి సంవత్సరంలో కొన్ని నెలలు చెల్లించడం జరిగేది.

ఏదైనా అవసరం నిమిత్తం సెలవు పెడితే జీతంలో కోత విధించే వారు. లెక్చరర్ల కొరత ఏర్పడి కళాశాలలు నిర్వీర్యంమైపోతున్న సమ యంలో కాంట్రాక్టు లెక్చరర్ల అవసరం ఏర్పడుతుంది. ప్రభుత్వం వీరితో వెట్టిచాకిరి చేయించుకుంటుంది. లేనిపోని నియమనిబంధనలు పెట్టి వీరిని తొలగించేందుకు ఏర్పాట్లు చేస్తుంది. ప్రభుత్వ నిబంధనలతో అర్థాంతరంగా అనేకమంది కాంట్రాక్టు లెక్చరర్లు ఉద్యోగాలు కోల్పోయే అవకాశం ఏర్పడింది. కార్పొరేట్ కళాశాలలకు అనుకూలంగా మారి ప్రభుత్వ కళాశాలలను నిర్వీర్యం చేసే అవకాశం వుందని వీరు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. విద్యార్థుల తల్లిదండ్రులు సైతం కార్పొరేట్ కళాశాలల వైపు మొగ్గుచూపడం బాధాకంగా వుందంటున్నారు. ప్రభుత్వ కళాశా లల్లో ఎక్కువగా ఎస్సీ,ఎస్టీ, బిసి విద్యార్థులే ప్రవేశాలు పొందుతుం టారు. ప్రభుత్వం అవలంభిస్తున్న విధానాల కారణంగా పేద విద్యార్థులు తీవ్రంగానష్టపోతున్నారు. ప్రస్తుతం కాంట్రాక్టు ప్రాతిపదికన నియమి తులై వున్న లెక్చరర్లను పర్మినెంటు చేయాలని డిమాండ్ చేస్తున్నారు.

రాష్ట్రవ్యాప్తంగా అన్ని ప్రభుత్వ కళాశాలలో నియమితులై వున్న కాంట్రాక్టు లెక్చరర్లు తమ డిమాండ్ల సాధన కోసం నిరాహారదీక్షలు చేస్తున్నారు. ప్రభుత్వం డిమాండ్లను ఆమోదించే వరకు న్యాయ పోరాటం చేస్తామని లెక్చరర్ల అసోసియేషన్ నేతలు కార్యదర్శి సునీల్ శర్మ స్పష్టం చేశారు. కలెక్టరేట్ ఎదుట చేపట్టిన నిరాహారదీక్ష శిబిరాన్ని వివిధ రాజకీయ, ప్రజా సంఘాల నేతలు సందర్శించి సంఘీభావం తెలుపుతున్నారు. ప్రభుత్వానికి కనువిప్పు కలిగే విధంగా భిక్షాటన చేయ డం, నల్లబ్యాడ్జీలను ధరించడం వంటి నిరసన కార్యక్రమాలు చేప ట్టారు. రాష్ట్రప్రభుత్వం స్పందించి కాంట్రాక్టు లెక్చరర్ల డిమాండ్లపై చర్చిం చాల్సిన అవసరం వుంది. లేకుంటే ప్రభుత్వ కళాశాలల్లో చదువుతున్న విద్యార్థులు నష్టపోయే ప్రమాదం వుంది.

# JEE-MAIN 2013 బి.టెక్/బి.ఆర్క్ అన్ని కేటగిరీలలో ఆలిండియా టాప్ 10 లో 10 ర్యాంకులతో పాటు

# ఓపెన్ కేటగిరీలో ఆలిండియా 100 లోపు 68 ర్యాంకులతో

# ఆలిండియా టాప్ ర్యాంకులన్నీ ఏకపక్షమే... శ్రీచైతన్య నారాయణ పక్షమే.

ఈ మాట ఏ ఒక్కరిదో కాదు... భారతదేశంలో ప్రతి ఒక్కరిదీ

| All India Rank | Name | H.T. No. |
|---|---|---|
| 1 (B. Tech) | Piyush Arya | H.T. No. 81203896 |
| 2 | K. Suma | B. Tech. H.T. No. 80418500 |
| 3 | N. Rajiv Teja | B. Tech. H.T. No. 80407750 |
| 4 | P. Karthikeya Sharma | B.Arch. H.T. No. 80533083 |
| 5 | P. Akhil | B.Arch. H.T. No. 80225609 |
| 6 | Sai Sandeep Reddy .P | B.Arch. H.T. No. 80527553 |
| 7 | S. Srikanth | B.Arch. H.T. No. 80417388 |
| 8 | P. Sai Kishan | B.Arch. H.T. No. 80535340 |
| 9 | Pathak Anand | B. Tech. H.T. No. 84706202 |
| 10 | T. Akhil | B.Arch. H.T. No. 80533827 |
| 1 (B. Arch) | Y. Akhil Kumar | H.T. No. 80417730 |

ఆలిండియా ఓపెన్ కేటగిరీ B.Tech/ B.Arch విభాగంలో 100 లోపు 68 ర్యాంకులతో సంచలనం సృష్టించిన శ్రీచైతన్య నారాయణ

4, 5, 6, 9, 10, 14, 15, 17, 19, 20, 20, 22, 22, 23, 24, 24,
25, 26, 28, 28, 29, 29, 32, 35, 37, 39, 42, 44, 46, 47, 48, 50,
51, 51, 53, 54, 55, 56, 57, 59, 61, 62, 64, 65, 65, 66, 67, 70, 71,
72, 77, 78, 79, 80, 82, 83, 83, 84, 86, 88, 91, 93, 93, 94, 96, 99

@ Category Rank

## B.Tech / B.Arch లో సాధించిన ర్యాంకులు

# 60419

## All India B.Tech/ B.Arch Open Category Ranks

| Rank Ranges | Below 100 | Below 500 | Below 1000 | Below 2000 | Below 5000 | Below 10000 |
|---|---|---|---|---|---|---|
| All India Ranks | 68 | 330 | 590 | 1070 | 2269 | 3816 |

ఇప్పటివరకు అందిన సమాచారం ప్రకారం

| సైఫాబాద్, లక్డీకాపూల్ (కేపిటల్) హైదరాబాద్ | కావూరి హిల్స్, మాదాపూర్, హైదరాబాద్ | మయూరి భవన్, గురునానక్ కాలనీ, విజయవాడ. | వేదవ్యాస్ భవన్, ఆసీల్‌మెట్ట, వైజాగ్. | వేదవ్యాస్ భవన్, రాఘవేంద్రనగర్, తిరుపతి. | ధనలక్ష్మీపురం నెల్లూరు. |
|---|---|---|---|---|---|
| 9247088401 | 9248080813 | 9246495924 | 9059885550 | 9912378646 | 9000310264 |
| 9912343960 | 9000309548 | 9059889550 | 9912341686 | 9908638027 | |

# శ్రీచైతన్య నారాయణ IIT అకాడమి

శ్రీచైతన్య, నారాయణ, కార్పొరేట్ ఎడ్యుకేషనల్ సొసైటీ వారి సౌజన్యంతో.

Eye Ads




గ్రహానుకూలతల వల్ల శరీరారోగ్యం బాగుంటుంది. చేసే వృత్తి, వ్యాపారాలు అనుకూలించి ఆర్థిక లావాదేవీలు సంతృప్తినిస్తాయి. ఎటువంటి పనైనా సాధించగలమనే మనోధైర్యం వుంటుంది. సంఘంలో గుర్తింపు ఏర్పడగలదు. ఇంట్లో చేసే శుభకార్య యత్నాలు ఫలిస్తాయి. బంధుమిత్రుల రాకతో అధిక ఖర్చులుంటాయి. విద్యార్థులు చివరకు అనుకున్న ఫలితాలు సాధిస్తారు.




స్పెక్యులేషన్‌లో స్వల్ప ఆదాయాలు, శత్రువులపై ఆధిక్యత, మీ మాటకు ఎదుర్లేదు. వృత్తి, వ్యాపారాల అభివృద్ధి, ఆదాయం బాగుంటుంది. సంతానం వల్ల మేలు, విద్యార్థులకు నూతన విద్యల అవకాశం, ఆరోగ్య లాభం. వ్యవసాయదారులకు ప్రభుత్వ సంబంధ లావాదేవీల అనుకూలత. పెద్దలను కలుసుకొంటారు. కళా, క్రీడాకారులకు విజయం. రాజకీయులకు అన్ని విధాల బాగుంటుంది.




ఉద్యోగులకు స్థానచలనం లేదా గృహ మార్పు. కుటుంబ వ్యక్తులతో సమస్యలు. ప్రభుత్వ సంబంధ కార్యాలు నిలచిపోవుట, ఆరోగ్య భంగం. ప్రతి చిన్న విషయానికి ఆందోళన. వృత్తి, వ్యాపారాలలో సామాన్య ఆదాయాలు, సంతానం గూర్చి ఆందోళన, శత్రువుల వల్ల ఊహించని సమస్యలు. భార్యాభర్తల మధ్య అవగాహన వుండదు. విద్యార్థులకు చిన్న విషయమైనా చిక్కు సమస్యలు, మనోదుఃఖాలుంటాయి.




గ్రహసంచారం వల్ల అన్ని రంగాల వారికి సమస్యలధికం. ఆరోగ్యం బాగుండదు. ప్రయాణాలందు కష్టాలు, బంధుమిత్ర విరోధాలు, ప్రతి మాటకు అపార్థాలు తీసుకొంటారు. ఊహించని సమస్యలు తలనొప్పి తెస్తాయి. వృత్తి, వ్యాపార, ఇతర రంగాలలో ఆర్థిక సామాన్యతలుంటాయి. స్త్రీ సౌఖ్యం తక్కువ. విద్యార్థులకు ఆందోళన కలిగించినా చివరకు విజయం. వ్యవసాయదారులకు కష్టాలధికం.




గ్రహానుకూలతల వల్ల అన్ని రంగాలవారు ఆర్థికంగా నిలదొక్కుకొంటారు. చేసే వృత్తి, వ్యాపారాలు రాణిస్తాయి. ఆరోగ్య, ధన లాభాలు. కుటుంబ సౌఖ్యం, సంతానాభివృద్ధి. నూతన వస్తు, వస్త్రాభరణాలు కొంటారు. స్పెక్యులేషన్ లాభిస్తుంది. నిరుద్యోగులకు అనుకూలమైనవారం. వ్యవసాయదారుల పనులు నిలకడగా సాగుతాయి. కళా, క్రీడాకారులకు నూతన పరిచయాలు ఏర్పడగలవు.




ఆర్థికంగా కొంత ఇబ్బందులున్నా పరవాలేదనిపిస్తుంది. భార్యాభర్తల మధ్య అవగాహన, ఆదాయానికి తగ్గ ఖర్చులుంటాయి. అవసరానికి రుణాలు చేయాల్సి వస్తుంది. ఉద్యోగులకు కొంత ఊరట. అనుకూల బదిలీలుంటాయి. విద్యార్థులు తాము ఆశించిన వాటిని పొందగలరు. వ్యవసాయదారులు నూతనోత్సాహంతో పనులు సాధిస్తారు. రాజకీయులు ఉత్సాహంతో వున్నప్పటికీ కొంత నీరసభావం కలుగుతుంది.

# వారఫలాలు

*తేది 6-7-2013 నుండి 12-7-2013 వరకు మేషంలో కేతువు; వృషభంలో రవి, కుజ, బుధ, గురులు; కర్కాటకంలో శుక్రుడు; తులలో శని, రాహువులు; వృషభ, మీన, కర్కాటక, సింహరాశులలో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

| | |
|---|---|
| 6తేది | శనిత్రయోదశి, పునర్వసు కార్తె. |
| 8తేది | అమా సోమవార వ్రతం. |
| 10తేది | జగన్నాథ రథయాత్ర, రంజాన్ నెల ప్రారంభం. |
| 11తేది | బోనాల పండుగ ఆరంభం. |
| 12తేది | త్రిలోచనా వ్రతం. |
| 13తేది | స్కంధ పంచమి. |

### శుభ ముహూర్తాలు

జూలై 9తేది నుండి ఆగష్టు 6తేది వరకు ఆషాడ మాసం శూన్యమాసం కనుక శుభ ముహూర్తాలు లేవు.

### జూలై తిథులు

**జ్యేష్ట బహుళ**

| | | | | | |
|---|---|---|---|---|---|
| 6 | శని | త్రయోదశి | ఉ | 07.46 | గం.ల.వ |
| 7 | ఆది | చతుర్దశి | ప | 10.17 | గం.ల.వ |
| 8 | సోమ | అమావాస్య | ప | 12.42 | గం.ల.వ |
| | | **ఆషాడ శుద్ధ** | | | |
| 9 | మంగళ | పాడ్యమి | ప | 02.57 | గం.ల.వ |
| 10 | బుధ | విదియ | సా | 04.57 | గం.ల.వ |
| 11 | గురు | తదియ | సా | 06.39 | గం.ల.వ |
| 12 | శుక్ర | చవితి | రా | 08.00 | గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.




బంధుమిత్రులతో సౌఖ్యం, సంతోషాలు, వ్యవహారానుకూలత వుంటుంది. వృత్తి, వ్యాపారాలు అనుకూలించడం వల్ల అన్ని విధాలుగా బాగుంటుంది. స్పెక్యులేషన్‌లో నష్టాలు తప్పవు. విద్యార్థులు నూతన ప్రయత్నాలకై దూర ప్రయాణాలు చేస్తారు. వ్యవసాయదారులు ఆర్థికంగా నిలదొక్కుకొంటారు. కళా, క్రీడాకారులకు వృత్తులలో రాణింపు. కుటుంబ సౌఖ్యం, కొన్ని సమస్యలు పరిష్కారమౌతాయి.




ప్రతికూల పరిస్థితుల వల్ల మనశ్శాంతి తక్కువ. ఆరోగ్యం బాగుండదు. ఉద్యోగులకు స్థానమార్పులు తప్పవు. బంధుమిత్రులతో విరోధాలు, ప్రభుత్వ పనులు నిలచిపోవుట, శత్రు భయం, వాహన ప్రమాదాలు, స్త్రీ సౌఖ్యలోపం, శస్త్ర చికిత్సా భయం. గృహంలో మార్పులు. వ్యవహారాలందు అపజయం. విద్యార్థులు తమ విద్యలకై గట్టి ప్రయత్నాలు చేయాలి. కోర్టు, పోలీసు కేసులతో సతమతమౌతారు.




గతంలో పూర్తికాని పనులు పూర్తవుతాయి. సాధు, సత్ పురుషలను కలుస్తారు. వృత్తి, వ్యాపారాలు సంతృప్తినిస్తాయి. ఆర్థికాదాయం బాగుంటుంది. శరీరారోగ్య రీత్యా కొంత ధననష్టం. అన్నీ రంగాలవారిని ఏదో ఒక సమస్య బాధిస్తుంది. స్నేహితుల మధ్య బేధాభిప్రాయాలుంటాయి. విద్యార్థుల తమ ప్రయత్నాలను ఉత్సాహంగా చేయాలి. వ్యవసాయ, స్వయం ఉపాధివారు ఉత్సాహంగా వుంటారు.




ప్రభుత్వ సంబంధిత కార్యాలన్నీ పూర్తవుతాయి. దూర ప్రయాణాలలో లబ్ధి, చేసే వృత్తి, వ్యాపారాలు లాభిస్తాయి. ఈవారం మీరనుకున్నది సాధిస్తారు. ఆదాయానికి లోటుండదు. కొంత విలాసానికై ఖర్చు చేస్తారు. విద్యార్థులకు వ్యవహారానుకూలతలుంటాయి. సంతాన సౌఖ్యం, వ్యవసాయదారుల పనులు ముమ్మరంగా సాగుతాయి. కళా, క్రీడాకారులు అగిన పనులను పూర్తి చేస్తారు.




భార్యాభర్తల మధ్య సరైన అవగాహన వుంటుంది. నూతన పరిచయాలు లాభిస్తాయి. మీ మాటకు విలువ వుంటుంది. చేపట్టిన పనులలో వ్యవహారానుకూలత, ప్రభుత్వ పనులు పూర్తగుట. శుభకార్యాలకు నూతన వస్తు, వాహన సామగ్రిని కొనుగోలు చేస్తారు. కుటుంబ సౌఖ్యం. విద్యార్థుల ప్రయత్నాలు ఫలిస్తాయి. వ్యవసాయదారులు పనులలో మార్పులు చేపట్టి విజయం సాధిస్తారు.




కుటుంబ సమస్యల పరిష్కారానికి రాజకీయ నాయకుల దర్శనం. వృత్తి, వ్యాపారాలన్నీ ఆశాజనకంగా వుంటాయి. ఆదాయం పర్వాలేదని పిస్తుంది. వ్యవసాయదారులు ధైర్యంతో తన పనులు చేపడతారు. కళా, క్రీడాకారులకు వృత్తిపరమైన ప్రోత్సాహకాలు, ఆర్థికాదాయాలుంటాయి. రాజకీయ నాయకులకు శత్రు జయం, శరీరారోగ్యం, క్రింది వర్గాల సహాయ సహకారాలుంటాయి.

# సమాజాన్ని స్థైర్య, ధైర్యాలతో నింపగలగాలి శాస్త్రం!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*డాక్టర్ పి.వి.శర్మ — బెంగుళూరు*

** శాస్త్రం చెప్పిన వాటిని ఛాందసాలను కొంటే ఎట్లా?*

శాస్త్రాలు చెప్పిన అంశాలు తర్వాత పరిశోధనల వల్ల మారుతున్నాయి. అలాంటప్పుడు ఆ అంశాలు సమాజాన్ని వెనక్కి నడిపిస్తున్నప్పుడు, స్థైర్య ధైర్యాలు దిగజారుస్తున్నపుడు వాటిని ఛాందసాలనుకోవడంలోనూ, నిషేధించడంలోనూ తప్పు లేదు. శాస్త్రం ఎప్పుడూ సమాజహితాన్ని కోరుతుందని మీరు మొదట అర్థం చేసుకోవాలి.

*జి.శైలూషి — గుంటూరు*

** ద్వారాలకు శ్రేష్టమైన ఏ కొయ్యలైనా వాడవచ్చునా?*

ఒక ద్వారానికి ఒకే కొయ్య అన్నది శాస్త్ర సూత్రం. విభిన్నమైన దారువులు ఒకే ద్వారానికి వాడకూడదు.

*పి.రోహిణి — తెనాలి*

** ఇంటిలో వాస్తు దోషాలు ఏ దిక్కులో వున్నాయో తెలుసుకోవడం ఎలా?*

స్త్రీ సమస్యలున్నాయనుకోండి ఉత్తర, దక్షణాల్లో దోషాలుండి తీరుతాయి. అప్పుడాయా దిక్కుల్ని పరిశీలిస్తే 'దోషాలు బహిర్గత'మవుతాయి.

*వై.రాణి — కర్నూలు*

** యంత్ర ప్రతిష్ట వల్ల ప్రయోజనాలేమిటి?*

దోషాల్ని కనిపెట్టి సరిచేసుకొనేలోగా అరవై శాతం వాస్తు దుష్ప్రభావాలు గృహస్థులపై దాడి చేస్తాయి. ఇలా జరగకుండా వుండాలంటే వెంటనే నిర్ణీత యంత్ర ప్రతిష్ట చేయిస్తే దుష్ప్రభావాలుండవు.

*కె.సి.ఎం — బాపట్ల*

** స్త్రీలు ఆడపిల్లల్ని కంటే అది వాళ్ల నేరమెట్లా అవుతుంది?*

అంతటి శాడిస్టులై పోతున్నారు జనం. పైగా సంస్కారం కనుమరుగై పోతున్నది. ప్రభుత్వాల ఉదాసీనత, కఠిన వైఖరులు లేకపోవడం వల్ల స్త్రీ అపవాదులపాలవుతున్నది. సామాజిక చైతన్యం చాలా అవసరం.

*సి.ప్రశాంతి — గూడూరు*

** తూర్పు భాగంలోని మొక్కను తీసివేశాము. పరిష్కారం చెప్పండి?*

దిక్కులోని ఎనిమిదవ భాగం ఈశాన్యం ఈ మాత్రం తెలియక అతను వాస్తు సిద్ధాంతి ఎట్లా అయ్యాడు? వృక్షవేధ మీకు బాధ గనుక మీరు కనీసం 'ఇరవై ఒక్కమొక్కల్ని నాటి సంరక్షించండి'. వృక్షవేధ నుంచి విముక్తులవుతారు.

*ఎం.అరుణ — విజయవాడ*

** ఇంటికి సమీపంలో టెలిఫోను టవరు నిర్మిస్తారట. మీ అభిప్రాయం ఏమిటి?*

పరాశర, భృగు సంహితలలో జనావాసాలకు, పర్యావరణానికి హాని కలిగించే విష వాయు తయారీకి కారకులైన వారు తరువాతి జన్మలో రౌరవ నరకాలనుభవిస్తారని వున్నది. ప్రజల్లో చైతన్యం రావాలి. ఉద్యమకారులు కావాలి. లేకపోతే భూమి 'మృతగోళం' అవుతుంది.

*రెడ్డి రాజగోపాలరెడ్డి — విశాఖ*

** యంత్ర ప్రతిష్ట తర్వాత 'వ్యాధి' పాలయ్యాను.*

యంత్ర ప్రతిష్ట దేవుడి గదిలోనే చేయాలి. గోడ, భూమి లోపల చేయకూడదు. వ్యాధికారకమని వాస్తు శాస్త్రాలే చెప్పాయి.

*డి.పవిత్రారెడ్డి — బెంగుళూరు*

** అంతర్మెట్లు ఈశాన్యంలో ఏ ప్రభావాన్ని చూపిస్తాయి?*

స్త్రీలైతే వైధవ్యాన్ని, పురుషులైతే ఆర్థిక సమస్యల్ని కలిగిస్తాయి. మెట్లు తీసేలోగా యంత్ర ప్రతిష్ట వల్ల నష్టాలు తప్పుతాయి.

*జె.ప్రభుదాసు — నెల్లూరు*

** అబ్బాయి స్థిరపడడం లేదు. సలహా చెప్పండి?*

తూర్పు దోషాలు సరిచేసుకోండి. ఈలోగా యంత్ర ప్రతిష్ట చేయండి. అబ్బాయికి గోమేధుకం (శ్రేష్ఠ) కుడి ఉంగరం వ్రేలికి ధరింపజేయండి.

*డి.పరబ్రహ్మశాస్త్రి — చెన్నై*

** ఇంట్లో ఆ మధ్య వెలగ చెట్టును తీసివేశాము. గత ఆరు మాసాలుగా పక్షవాతంతో బాధపడుతున్నా పరిష్కారం సూచించండి.*

మీ వివరాల ప్రకారం మీది మేషరాశి. అధిపతి కుజుడు. యూనివర్శిటీ తదితర ప్రాంతాలలో నూటొక్క మొక్కలను నాటి సంరక్షించండి. దోష నివృత్తి అవుతుంది. మీ రాశి వృక్షం రక్త చందనం. బెరడును ఔషధంగా స్వీకరించండి.

# ప్రభుత్వ ఖజానా నింపే కొత్త మద్యం పాలసీ!



**జనాభా ప్రాతిపదికన మద్యం షాపులకు ప్రభుత్వం రేటును నిర్ణయించింది. మద్యం షాపులకు ఫీజులను భారీగా పెంచి మద్యాన్ని అధిక ధరలకు విక్రయించి సొమ్ము చేసుకోవాలన్న ఆలోచన ప్రభుత్వం చేయడం బాధాకరం.**



**నెల్లూరులోని ఓ మద్యం షాపు వద్ద సందడి.**

మద్యం ప్రియులు ఇక నుంచి ఎక్కడ పడితే అక్కడ మద్యం సేవించకుండా ప్రత్యేక రూంలు ఏర్పాటు కానున్నాయి. ఇందుకు రాష్ట్రప్రభుత్వం ఇటీవల నూతన మద్యం పాలసీ అమలు చేయాలని నిర్ణయించింది. గ్రామీణ ప్రాంతాల్లో విచ్చలవిడిగా ఏర్పాటై వున్న బెల్టుషాపులను తొలగించాలని గత నెలలో రాష్ట్రముఖ్యమంత్రి ఎక్సైజ్ అధికారులను ఆదేశించిన విషయం అందరికి తెలిసిందే. సిఎం ఆదేశించి నెలరోజులు గడవక ముందే నూతన మద్యం పాలసీ అమలు కోసం ప్రణాళిక రూపొందించి ఆమోదించడం జరిగింది. ఈ పాలసీ అమల్లోకి వస్తే రాష్ట్ర ఖజానాకు భారీ స్థాయిలో ఆదాయం సమకూరుతుంది. ఒకప్రక్క బెల్టుషాపులను తొలగించాలని ఆదేశించడం, మరోప్రక్క మద్యపాన ప్రియుల కోసం ప్రత్యేకంగా పర్మినెంటు రూంలను ఏర్పాటు చేయాలని నిర్ణయించడం పట్ల విపక్ష నేతలు సిఎం తీరుపై మండిపడుతున్నారు.

జనాభా ప్రాతిపదికన ఎన్నికల్లో రిజర్వేషన్లు ఏవిధంగా నిర్ణయిస్తారో అదేవిధంగా జనాభాను ప్రాతిపదికగా తీసుకొని మద్యం షాపులకు రేటును ప్రభుత్వం నిర్ణయించింది. ఇందుకు 2011 జనాభా లెక్కలను కొలమానంగా తీసుకున్నట్లు తెలుస్తుంది. మద్యం షాపులకు ఫీజులను భారీగా పెంచి మద్యంను అధిక ధరలకు విక్రయించి సొమ్ము చేసుకోవాలని ప్రభుత్వం సూచించినట్లుంది. 5వేల జనాభా కలిగిన ప్రాంతంలో మద్యం షాపు ఏర్పాటు చేస్తే లక్షరూపాయలు ఫీజుగా నిర్ణయించారు. 20లక్షల జనాభా మించితే కోటిరూపాయలకు పైగా ఫీజు వసూలు చేస్తారు. నూతన విధానం జూలై నెల నుంచి అమలు చేస్తారు. ఇప్పటికే మద్యం షాపులు ఏర్పాటు చేసిన నిర్వాహకుల నుండి కొత్తగా నిర్ణయించిన ఫీజును వసూలు చేసి రెన్యువల్ చేస్తారు. పట్టణాలతోపాటు గ్రామీణ ప్రాంతాల్లో కూడా మద్యం వ్యాపారులు సిండికేటుగా ఏర్పడి మద్యం ధరలు ఒకేవిధంగా వుండేటట్లుగా ఏర్పాట్లు చేసుకుంటున్నారు.

ఇప్పటికీ గ్రామాల్లో మద్యం బెల్టుషాపులు నిర్వహిస్తున్నారు. అధిక ధరలకు మద్యం విక్రయించే అవకాశం వుంది. ఎందుకంటే బెల్టుషాపులకు మద్యం సరఫరా చేసే షాపు నిర్వాహకులు ప్రభుత్వానికి అధికంగా ఫీజు చెల్లించాల్సి రావడంతో ఈ భర్తీని కొంతమేర పూడ్చుకొనేందుకు ధరలు పెంచకతప్పనిసరి పరిస్థితి. మద్యం సేవించడం పట్ల కలిగే అనర్థాలు గురించి ఒక ప్రక్క ప్రచారం చేస్తూనే మద్యం విక్రయాలు పెంచాలని సంబంధిత శాఖ అధికారులపై ప్రభుత్వం ఒత్తిడి తేవడం ఆనవాయితీగా మారింది. రహదారులకు ఇరువైపుల వుండే మద్యం షాపుల్లో త్వరలో పర్మినెంటు రూంలు నిర్మిస్తారు. ఈ రూంలో నిర్ణయించిన సమయం ప్రకారం మద్యం సేవించవచ్చు. జాతీయ రహదారి ప్రక్కన వున్న డాబా ప్రాంగణంలో పర్మినెంటు రూంలను నిర్మించుకోవాలని మద్యం సిండికేట్లు ప్రతిపాదిస్తున్నారు. డాబాల్లో అనధికారికంగా మద్యం సేవించరాదు. అందువల్లనే మద్యం షాపుకు అనుబంధంగా ఇక్కడే రూంలు ఏర్పాటు చేసుకోనున్నారు.

జిల్లాలో 348 మద్యం షాపులకు గతంలో వేలం పాటలు నిర్వహించగా 329 షాపులకు మాత్రం టెండర్లు దాఖలయ్యాయి. 19 షాపులు నేటికి ఖాళీగానే వున్నాయి. ప్రస్తుతం రాష్ట్ర ప్రభుత్వం తీసుకొచ్చిన కొత్త మద్యం పాలసీ ద్వారా ఖాళీగా వున్న షాపులకు త్వరలో టెండర్లు పిలిచి భర్తీ చేయనున్నారు. మరో ఏడాదిపాటు రెన్యువల్ చేసి ఆతర్వాత మళ్లీ మద్యం షాపులకు టెండర్లు పిలిచే అవకాశం ఉంటుందని కొందరు అధికారులు చెబుతున్నారు. నూతన మద్యం పాలసీ అమలు కోసం జిల్లా ఎక్సైజ్‌శాఖ అధికారులు కసరత్తు ప్రారంభించారు. జిల్లావ్యాప్తంగా జనాభా లెక్కలకు సంబంధించిన సమాచారాన్ని సంబంధిత శాఖల నుంచి సేకరించి, ఇప్పటికే మద్యం షాపులు ఏర్పాటు చేసి వున్న ప్రాంతంలో ఎంతమంది జనాభా వున్నారన్న దానిపై పరిశీలన జరుపుతారు.

నూతన మద్యం పాలసీ అమలులో గ్రామీణ ప్రాంతాల్లో మరిన్ని బెల్టుషాపులు తెరచుకునే అవకాశం వుంది. అంతేకాకుండా సామాన్య ప్రజలు తమ కష్టార్జితంలో 80శాతం నగదు మద్యం సేవించేందుకు ఖర్చు చేస్తుంటారు. సందెట్లో సడేమియా అన్న చందంగా ఎక్సైజ్ పోలీసులు మద్యం షాపుల నుంచి మరింత దండకాలు చేసుకునే అవకాశం కల్పించబడిందన్న ప్రచారం జరుగుతుంది.

---

ఇక ఎన్నికలే తరువాయి

# పంచాయితీల రిజర్వేషన్ ప్రక్రియ ఖరారు!

- గ్రామ పంచాయితీల్లో వార్డుల రిజర్వేషన్ ఖరారు కావడంతో గ్రామీణ ప్రాంతాల్లో ఎన్నికల కోలాహలం నెలకొనింది.
- రిజర్వేషన్ల ఆధారంగా ఏ వార్డుల్లో ఎవరిని అభ్యర్థిగా నిలపాలన్న ఆలోచనల్లో అన్ని రాజకీయ పార్టీలు మునిగి తేలుతున్నాయి.

త్వరలో జరుగనున్న గ్రామ పంచాయితీల ఎన్నికలకు సంబంధించిన రిజర్వేషన్లు ఖరారయ్యాయి. గత 10రోజుల నుంచి జిల్లా, మండల స్థాయి అధికారులు రిజర్వేషన్లను ఖరారు చేయడంతో అహర్నిశలు శ్రమించాల్సి వచ్చింది. 10రోజుల అనంతరం 2011 సంవత్సరం జనాభా లెక్కల ప్రకారం ఓటర్ల జాబితాను సమగ్రంగా పరిశీలించిన అనంతరం 25వ తేది రాత్రికి రిజర్వేషన్లు ఖరారు చేస్తూ జిల్లా కలెక్టర్ గెజిట్ నోటిఫికేషన్ జారీ చేశారు. దీంతో అన్ని రాజకీయపార్టీలు సైతం సంతోషం వ్యక్తం చేస్తూ స్థానిక సంస్థల ఎన్నికల నిర్వహణకు సమాయత్తమవుతున్నాయి. మండల పరిధిలోని అన్ని గ్రామ పంచాయితీల వివరాలు పొందుపరచి ఆ గ్రామాల్లోనే నోటీసుబోర్డుల్లో ప్రచురించారు. అభ్యంతరాలను స్వీకరించేందుకు కూడా ఇక అవకాశం వుండదు. రిజర్వేషన్ల ప్రక్రియ పూర్తి కావడంతో ఎన్నికల నోటిఫికేషన్ 3వ తేది వెలువడింది.

## రిజర్వేషన్ల వివరాలు

జిల్లాలో మొత్తం 940 గ్రామ పంచాయితీలు వున్నాయి. వీటిలో 8910 వార్డులు ఏర్పాటు చేశారు. పంచాయితీలకు సంబంధించి 86 పంచాయితీలను ఎస్టీలకు రిజర్వేషన్ చేశారు. ఇందులో మహిళలకు 43, జనరల్‌కు 43 కేటాయించడం జరిగింది. అలాగే ఎస్సీలకు 196 రిజర్వు చేయగా, వీటిలో మహిళలకు 98, జనరల్ కేటగిరి క్రింద 98 కేటాయించారు. వెనుకబడిన తరగతుల వారికి 353 పంచాయితీలు కేటాయించగా వీటిలో మహిళలకు 126, జనరల్ క్రింద 129 రిజర్వు చేశారు. అన్ రిజర్వుడు క్రింద 203 కేటాయించగా జనరల్ మహిళలకు 202 పంచాయితీల రిజర్వు చేసినట్లు నోటిఫికేషన్‌లో పేర్కొన్నారు. ప్రధానంగా ఈ దఫా ఎక్కువ సంఖ్యలో రిజర్వుడు స్థానాలు వుండడంతో అన్ని రాజకీయ పక్షాలు అభ్యర్థులను ఎంపిక చేసే పనిలో నిమగ్నమై వున్నాయి.

## వార్డుల వివరాలు

940 గ్రామ పంచాయితీలకు సంబంధించి 8910 వార్డులు ఏర్పాటు చేశారు. వీటిలో ఎస్టీ మహిళలు 698, జనరల్ 269, ఎస్సీ జనరల్ 1167, ఎస్సీ మహిళలకు 1341, బిసి జనరల్ 1213, బిసి మహిళ 1112, జనరల్ కేటగిరి క్రింద 1806, మహిళలు 1304 వార్డులను కేటాయించారు. పోలింగ్ కేంద్రాల ఏర్పాటుకు సంబంధించి ఎన్నికల సంఘం ప్రత్యేకంగా మార్గ దర్శకాలను అధికారులకు జారీ చేసింది. 600 మంది ఓటర్లకు ఒక బూత్‌ను ఏర్పాటు చేయాలని అందులో పేర్కొంది. కొన్ని గ్రామ పంచాయితీల్లో అధికారపార్టీ నేతలు సూచించిన విధంగా పోలింగ్ కేంద్రాలను ఏర్పాటు చేస్తున్నారన్న ఆరోపణలు వినిపిస్తున్నాయి. పార్టీలకు అనుకూలంగా ఏప్రాంతంలో ఓట్లు వున్నాయో అక్కడ పోలింగ్ కేంద్రాన్ని ఏర్పాటు చేయాలని డిమాండ్ చేస్తున్నారు.

మండలస్థాయి అధికారులను ఏదోఒక విధంగా బెదిరించి పోలింగ్ కేంద్రాలను ఏర్పాటు చేయించుకొంటున్నట్లు తెలుస్తుంది. 8110 వార్డులకు గాను 8988 పోలింగ్ కేంద్రాలను ఇప్పటికే ఏర్పాటు చేసినట్లు పంచాయితీ అధికారులు ప్రకటించారు. ప్రభుత్వం జారీ చేసిన మార్గదర్శకాల ప్రకారం కాకుండా కొందరు అధికారులు ఇష్టానుసారంగా వ్యవహరిస్తూ పోలింగ్ కేంద్రాలను ఏర్పాటు చేస్తున్నారు. గ్రామ పంచాయితీల్లో వార్డుల రిజర్వేషన్ ఖరారు కావడంతో గ్రామీణ ప్రాంతాల్లో ఎన్నికల కోలాహలం నెలకొంది. ఏ గ్రామ పంచాయితీల్లో వార్డుల్లో ఏ రిజర్వేషన్‌కు సంబంధించిన అభ్యర్థిని ఎన్నికల బరిలోకి దింపాలన్న అన్వేషణ జరుగుతుంది.

జిల్లా పంచాయితీ కార్యాలయ సిబ్బంది అధికారులు శ్రమించి గ్రామ పంచాయితీ వార్డుల రిజర్వేషన్లను ఒక కొలిక్కి తేవడంతో అధికార యంత్రాంగం ఊపిరిపీల్చుకొంది. ఎన్నికల నిర్వహణకు సంబంధించి ఎన్నికల సంఘం ఏ క్షణంలోనైనా నోటిఫికేషన్ జారీ చేసే అవకాశం వుంది. గ్రామ పంచాయితీ ఎన్నికలు ముగిసిన అనంతరం మునిసిపాల్టీ, జిల్లా మండల పరిషత్ ఎన్నికలు నిర్వహిస్తారు. జూలై నెల నుంచి ఈ సంవత్సరం ఆఖరి వరకు ఎన్నికల నిర్వహణకే అధికారులు ఎక్కువ సమయం కేటాయించాల్సి వుంటుంది.



# ఓ మోస్తరు బలుపు!

అల్లూరు రహీం

కాస్త అల్లరి, మరికాస్త ఆకతాయితనం, బోలెడంత వినోదం వీటన్నింటికీ ఓ రూపమిస్తే... హీరో రవితేజ ప్రత్యక్షమవుతాడు. వినోదం పంచడంలో ప్రత్యేకమైన శైలిని అలవర్చుకొన్న హీరో ఆయన. చిన్న చిన్న పాత్రలతో ప్రయాణం మొదలుపెట్టి పరిశ్రమలో అంచలంచెలుగా ఎదిగాడు. మాస్ కథా నాయకుడిగా ప్రేక్షకుల్లో గుర్తింపు సంపాదించాడు. తెరపై ఎంతగా నవ్విస్తాడో, అదే స్థాయిలో భావోద్వేగాలు కూడా పండిస్తాడు. కానీ హీరో రవితేజ గత రెండేళ్లుగా నటించిన మిరపకాయ్, డాన్‌శీను, దరువు, దేవుడు చేసిన మనుషులు చిత్రాలు ఫట్‌మనడంతో ఇబ్బందుల్లో పడ్డాడు. ఇటువంటి క్లిష్ట సమయంలో చెన్నైలో ప్రముఖ సినీ ఫైనాన్షియర్‌గా పేరుగాంచిన పరం వి పొట్లూరి నిర్మాతగా వ్యవహరించి, బాడీగార్డ్ ఫేం దర్శకుడు మలినేని గోపిచంద్ నిర్దేశకత్వంలో తీసిన చిత్రమే బలుపు. వాస్తవానికి బలుపు అంటే ఆత్మవిశ్వాసం. ఆత్మవిశ్వాసం మెండుగా ఉన్నవాడు ఎప్పుడూ బలుపున్నోడిగానే కనిపిస్తాడు. రవితేజను దృష్టిలో పెట్టుకొని పెట్టిన ఈ పేరుకు పూర్తిస్థాయిలో న్యాయం చేకూర్చాడాయన. తెలుగు సినిమా విజయానికి ఈ మధ్య దగ్గర దారిని కొందరు దర్శకులు వెతుక్కొన్నారు. అదే హాస్యం. కనీసంలో కనీసం గ్యారంటీగా విజయం సాధించాలంటే దాన్నే నమ్ముకొన్నారు. పెద్ద హీరోలు సైతం యాక్షన్ ఎంటర్‌టైన్‌మెంట్‌లు చేస్తున్నారు. బలుపు సినిమాలో హీరో రవితేజ, హీరోయిన్ శృతి హాసన్, ప్రత్యేక పాత్రలో బ్రహ్మానందం, విలన్లు ప్రకాష్‌రాజ్, అశుతోష్ రాణా, డాక్టర్ సావిత్రిగా అలీల పాత్రలు ఈ బాటలోనే నడుస్తాయి. దీనికి తగ్గట్టుగా కథ వ్రాశాడు కోన వెంకట్. ఆయనతో కలిసి వెలిగొండ శ్రీనివాస్ మాటలు వ్రాస్తే దర్శకుడు వీరితో కలసి బోర్‌లేని స్క్రీన్‌ప్లే వ్రాశాడు. ఇదే బలుపును చూసేట్లు చేసింది. ఈ సినిమా కథ పాతదే. కథనం చూసేట్లు కుదిరిందన్న మాట. బలుపుకు కలిసొచ్చిన అంశం పాటలు. లక్ష్మీరాయ్ నర్తించిన లక్కీ రాతోపాటు శృతిహాసన్ అందాలు ప్రదర్శించిన కాజల్ చెల్లిరా, పడిపోయాను, పాతికేళ్ల చిన్నది పల్లవులతో సాగే పాటలు బాగున్నాయి. అంజలితో చిత్రీకరించిన నిను చూసిన క్షణంలో పాటతోపాటు మిగతా వాటికి సంగీత దర్శకుడు తమన్ మాస్‌తోపాటు క్లాస్ సంగీతమందించాడు. మాటలకన్నా మేనరిజం, కామెడీ ఈ సినిమాలో ఎక్కువ. హీరో నాకు బలుపు ఎక్కువని చెప్పే డైలాగ్‌తోపాటు పగను పెంచుకోకు... ప్రాణం తీస్తుంది. ఎమోషన్స్‌తో ఆడుకోవద్దు వంటివి బాగున్నాయి.




చిత్ర కథలోనికి వెళ్తే శృతి(శృతిహాసన్), క్రేజీమోహన్(బ్రహ్మానందం)లు కలసి క్లబ్బుల్లో, పబ్బుల్లో పెళ్లికాని యువకులను కవ్వించి మోసం చేస్తుంటారు. వివిధ కంపెనీల బకాయిల వసూళ్ల ఏజెంటుగా వ్యవహరించే రవి(రవితేజ) స్నేహితుడు రాజేష్‌ను కూడా శృతి, వాళ్ల మామ క్రేజీమోహన్ వాడేసుకోవడంతో వారికి బుద్ధిచెప్పను రంగంలోనికి దిగిన రవి, శృతిల మధ్య కాస్త కెమిస్ట్రీ జరుగుతుంది. ఇంతలో రవి నాన్న మోహన్‌రావు(ప్రకాష్‌రాజ్) ఈ విషయం వెళ్లి శృతి నాన్న(నాజర్)తో చెప్పేస్తాడు. కానీ వాస్తవానికి విశాఖపట్నంలో పేరుగాంచిన రౌడీపూర్ణ(అశుతోష్ రాణా) మేనల్లుడు (అడవి శేషు)తో శృతి పెళ్లి ఖరారై ఉంటుంది. పూర్ణ తన చెల్లెలు(సన) పిలుపుతో హైదరాబాద్ వచ్చి చూడగా రవి, మోహన్‌రావుల అసలు కథ బయట పడుతుంది. వాస్తవానికి రవి పేరు శంకర్, మోహన్‌రావు పేరు నానాజీ. వీరిద్దరూ విశాఖపట్నంలో పెద్ద రౌడీలు. కొన్నాళ్లు శంకర్, పూర్ణ దగ్గర కూడా పనిచేస్తాడు. ఈ క్రమంలో నానాజీ కుమార్తె డాక్టర్ అంజలి(అంజలి)ని ప్రేమిస్తాడు. ఆమెను పూర్ణ కొడుకు(అజయ్) చంపనుపోగా అతన్ని నానాజీ అంతమొందిస్తాడు. అంజలి ప్రాణాలు విడుస్తూ శంకర్, నానాజీలను కలిపేస్తుంది. విశాఖలో రౌడీయిజం వీడి బయటకువెళ్లి జీవించమని కోరుతుంది. దీంతో ఈ బద్ధ శత్రువులు ఒకటై బతుకుతుంటారు. చివరన ఇదే స్ఫూర్తితో శంకర్, నానాజీలు పూర్ణకు బుద్ధి చెప్పడం, శంకర్ శృతిని తనదాన్ని చేసుకోవడంతో చిత్రం ముగుస్తుంది. హీరో రవితేజ కోలుకోను బలుపు ఊతమిచ్చిందనవచ్చు. అదే విధంగా హీరోయిన్ శృతిహాసన్‌ను గ్లామర్ క్వీన్‌నని ఈ చిత్రంతో నిరూపించుకొంది.

## పదినిమిషాలకు పది లక్షలు!



హీరోయిన్లు నాలుగు రాళ్లు వెనకేసుకోవడానికి బోలెడన్ని మార్గాలున్నాయి. సినిమాల్లో నటిస్తే ఎలాగూ పారితోషికాలొస్తాయి. వ్యాపార ప్రకటనలూ కాసుల వర్షం కురిపిస్తున్నాయి. షాపింగ్‌మాల్స్‌లో సందడి చేసినా లక్షలు వస్తున్నాయి. ఇప్పుడు విదేశాల్లో జరిగే ఈవెంట్లలో పాల్గొన్నా డబ్బులే డబ్బులు. నయనతారకు ఇలాంటి ఆఫర్లు చాలా వస్తున్నాయి. అయితే డబ్బుల కోసం అక్కడికి వెళ్లేందుకు నయన ఇష్టపడడం లేదు. మరీ బతిమాలితే పారితోషికం ఎక్కువ డిమాండ్ చేస్తోందట. ఆ రేటుకు భయపడి నయనను ఆహ్వానించడం మానేశారట. కొంతమంది నయనతార కోరినంత పారితోషికం ఇవ్వడానికి కూడా సిద్ధమవుతున్నారు. పది నిమిషాల కార్యక్రమంలో పాల్గొనడానికి పది లక్షల రూపాయలు డిమాండ్ చేస్తోంది. విమాన ఛార్జీలు కూడా నిర్వాహకులే చెల్లించాలని షరతు విధిస్తోంది. నెలకు ఇలాంటి కార్యక్రమాలు నాలుగైదు తగిలితే సరిపోతుంది కదూ.

## ఎన్టీఆర్ ఛాన్స్!



స్వామిరారా సినిమాతో తెలుగు పరిశ్రమను ఆకట్టుకొన్న దర్శకుడు సుధీర్ వర్మ. పరిమిత బడ్జెట్‌లో తెరకెక్కిన ఆ చిత్రం లాభాల బాట పట్టింది. ఇప్పుడు సుధీర్‌కు ఒక బంపర్ ఆఫర్ వచ్చింది. ఆయనకు హీరో ఎన్టీఆర్ నుంచి పిలుపు వచ్చిందని సమాచారం. 'మంచి కథ ఉంటే చెప్పు... చేద్దాం' అని ఎన్టీఆర్ ఆఫర్ ఇచ్చాడట. దీంతో సుధీర్ ఎన్టీఆర్ కోసం ఓ కథ సిద్ధంచేసే పనిలో ఉన్నాడిప్పుడు. ఎన్టీఆర్ సినిమా 'రామయ్యా వస్తావయ్యా' ప్రస్తుతం చిత్రీకరణ దశలో ఉంది. హరీష్ శంకర్ దర్శకత్వం వహిస్తున్న ఈ చిత్రాన్ని సెప్టెంబరులో విడుదల చేస్తారు. ఆ తర్వాత రభస చిత్రం ఉంటుంది. ఆ వరుసలో సుధీర్ కథ నచ్చితే సినిమా మొదలయ్యే అవకాశాలున్నాయి.

## కోట్ల మీదున్న దర్శకులు!

సినిమాకు కెప్టెన్ ఆఫ్ ది షిప్ దర్శకుడే. దర్శకుడి ఆలోచనల్లోంచి పుట్టిన సృజనే సినిమా. తెలుగు సినీ పరిశ్రమలో హీరో పారితోషికాన్ని మించి పారితోషికం తీసుకొంటున్న దర్శకులు కొందరున్నారు. తాజా లెక్కల ప్రకారం టాలీవుడ్‌లో అత్యధిక పారితోషికం తీసుకుంటున్న దర్శకుడు రాజమౌళి. బాహుబలి చిత్రం కోసం భారీ పారితోషికం అందుకొన్నట్టు పరిశ్రమలో టాక్. పూరి జగన్నాధ్ ఇద్దరమ్మాయిలతో సినిమాకు పది కోట్ల రూపాయలు తీసుకొన్నాడట. వి.వి.వినాయక్ ఇదే రేంజ్‌లో ఉన్నాడట. శ్రీనువైట్ల బాద్‌షాకు పది కోట్ల రూపాయలు పుచ్చుకొన్నాడట. త్రివిక్రమ్ పవన్‌కళ్యాణ్ హీరోగా తయారవుతున్న అత్తారింటికి దారేది సినిమాకు ఆరు కోట్ల రూపాయలు పారితోషికంగా తీసుకొన్నాడని సమాచారం. సింహా తర్వాత బోయపాటి శ్రీను కూడా కొండెక్కి కూర్చున్నాడట. ఈ దర్శకుల సినిమాల్లో ఎన్టీఆర్, పవన్, ప్రభాస్, మహేష్, చరణ్ హీరోలైతే నిర్మాతలు పారితోషికాలకే 25 కోట్లు వెచ్చించాలి. మరి సినిమా పూర్తయ్యే సరికి ఎంత మొత్తం అవుతుందో చెప్పలేని పరిస్థితి.

## స్నేహ ఎదురుచూపు



హీరోయిన్ స్నేహ సెకండ్ ఇన్నింగ్స్ మొదలుపెట్టడానికి తహతహలాడుతోంది. ఎప్పుడూ హోమ్లీగా కనిపించడానికి ఇష్టపడే స్నేహ ఇప్పుడు గ్లామర్ పాత్రలైనా పర్లేదు అంటోంది. నటనతోపాటు ఈ సారి నిర్మాణ బాధ్యతలు మోసేందుకు ప్రణాళికలు రచించుకొంది. సొంతంగా ఓ సినిమా తీయాలని గత కొంతకాలంగా ప్రయత్నాలు చేస్తోంది. అయితే అవేమీ ఓ కొలిక్కి రావడం లేదు. కారణం సరైన కథ దొరకడం లేదట. ఎవరైనా కథ వినిపించే ముందు కథ బాగుండాలి, నా పాత్రకు ప్రాధాన్యం ఉండాలి అనే షరతు పెడుతోందట. దాంతో రెండింటికీ న్యాయం చేసే కథలు పుట్టడం లేదు. మంచి కథకోసం అన్వేషణ జరుగుతోంది. ఈ ప్రయాణంలో చాలా కథలు విన్నాను. కాస్త ఆలస్యమైనా ఓ మంచి కథతో రావాలని ఉంది. అందుకే ఈ జాప్యం జరుగుతోంది. ఇంకొన్ని రోజుల్లో నా సినిమా గురించి పూర్తి వివరాలు ప్రకటిస్తా అంటోంది స్నేహ.

## కథ నచ్చితేనే నటిస్తాను!



గుండెజారి గల్లంతయ్యిందే చిత్రం విజయం హీరోయిన్ నిత్య మీనన్‌లో ఆత్మవిశ్వాసం నింపింది. ప్రస్తుతం చేతన్ దర్శకత్వంలో ఓ చిత్రంలో నటిస్తున్న ఆమె షూటింగ్ గ్యాప్‌లో పిచ్చాపాటీగా మాట్లాడుతూ సినిమా ఒప్పుకొనే ముందు చాలా షరతులు విధిస్తున్నానన్న మాట నిజం కాదు. నా షరతు ఒక్కటే. కథ నచ్చాలి. మంచి కథ అయినప్పుడు తప్పకుండా అన్ని పాత్రలు బాగుంటాయని నా నమ్మకం. అదే విధంగా పనికి తగిన పారితోషికం కూడా ఆశిస్తానంది. డ్యాన్స్ అంటే భయమని, తాను నటించే సినిమాలో పాటలు తక్కువుంటే బాగుంటుందని కోరుకొంటానంది.

# రాజన్నదళం పోస్టర్ విడుదల!

### స్థానిక ఎన్నికల్లో పోటీకి నిర్ణయం



పోస్టర్ విడుదల చేస్తున్న చిరంజీవిరెడ్డి తదితరులు.

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నుంచి సస్పెన్షన్‌కు గురైన మెట్టుకూరు చిరంజీవి రెడ్డి నేతృత్వంలో రాజన్న దళం ఏర్పడిన సంగతి తెలిసిందే. ఉదయగిరి ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్ రెడ్డి, ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డిలకు వ్యతిరేకంగా పోరాటం సాగిస్తామని, పార్టీ నుంచి సస్పెండైనా పార్టీ వీడక వైఎస్ ఆశయాలకు అనుగుణంగా పనిచేస్తామని చెప్తున్న ఈ రాజన్న దళం కొత్తగా పోస్టర్‌ను విడుదల చేశారు. నగరంలో జరిగిన కార్యక్రమంలో మెట్టుకూరు చిరంజీవిరెడ్డి, కర్తం శ్రీనివాసులు రెడ్డి, గంగినేని రంగయ్య, మాలేపాటి వెంకట సుబ్బానాయుడు, ఎరజర్ల మాల్యాద్రి, చిమాని రవీంద్రనాయుడు, మెట్టుకూరు అమరజీవిరెడ్డి, ఎడ్లపల్లి వెంకట్రావు, కొప్పోలు మాల్యాద్రిలు పాల్గొని రాజన్నదళం కార్యక్రమాలను వివరించారు. గతంలో కాంగ్రెస్ పార్టీలో క్రమశిక్షణ గల కార్యకర్తలుగా పార్టీ కోసం కష్టపడి పనిచేశామన్నారు. మాపై కక్ష కట్టిన కొందరు అభాండాలు వేశారన్నారు. ఉదయగిరి ఎమ్మెల్యే చంద్రశేఖర్‌రెడ్డి తమను దూరంగా పెట్టారని తెలిపారు. వైఎస్ మీద వున్న అభిమానంతో ఎన్నో అవమానాలు ఎదుర్కొన్నామని ఆ తర్వాత వైఎస్ జగన్ పార్టీ పెట్టడంతో ఆ పార్టీలో చేరామన్నారు. ఇటీవల జరిగిన సహకార సంఘ ఎన్నికల్లో మేకపాటి సోదరులు తమతో సంప్రదించకుండా తెలుగుదేశం పార్టీ వారిని ఎన్నికల్లో పోటీకి నిలబెట్టారని, దీనిపై ప్రశ్నిస్తే తమను అన్యాయంగా సస్పెండ్ చేశారని ఆరోపించారు. అయినా సరే వైఎస్ రాజశేఖర్‌రెడ్డి మీద వున్న అభిమానంతో పార్టీని వదలకుండా రాజన్నదళంగా ఏర్పడ్డామన్నారు. స్థానిక సంస్థల ఎన్నికల్లో ఉదయగిరి నియోజకవర్గంలో రాజన్నదళం క్రిందే పోటీచేస్తామని, విజయం సాధిస్తామని ధీమా వ్యక్తం చేశారు.

# రూ.40 కోట్లతో ఎస్సీ రుణ ప్రణాళిక!

### ● రాష్ట్ర ప్రభుత్వ ఆమోదం

ఎస్సీ కార్పొరేషన్ ద్వారా 2013 – 14 ఆర్థిక సంవత్సరానికి సంబంధించి 40 కోట్ల రూపాయలతో రుణ ప్రణాళిక రూపొందించారు. బ్యాంకు లింకేజీ రుణాలు, మైనర్ ఇరిగేషన్, పాడిపరిశ్రమ, భూమి కొనుగోలు పథకం, పావలా వడ్డీ, నిరుద్యోగులకు శిక్షణ కార్యక్రమం, తదితర పథకాలకు రుణాలు అందించనున్నారు. ఎస్సీ కార్పొరేషన్ రూపొందించిన కార్యాచరణ ప్రణాళికకు రాష్ట్ర ప్రభుత్వం ఆమోదం తెలిపింది. బ్యాంకర్ల సమావేశంలో దీన్ని ప్రవేశపెట్టి అన్ని భూములకు రుణాలు మంజూరు లక్ష్యాలను నిర్దేశించారు. బ్యాంకుల నుంచి మంజూరు లేఖలు అందితే రుణం మంజూరు కోసం దరఖాస్తులను స్వీకరిస్తారు. రేషన్ కార్డు ఆన్‌లైన్‌లో లేకపోతే దరఖాస్తును తిరస్కరిస్తారు. బ్యాంకు నుంచి మంజూరు లేఖ అందిన తర్వాత సబ్సిడీ దరఖాస్తును అందిస్తారు. దీనిని భర్తీచేసి ఎస్సీ కార్పొరేషన్ కార్యాలయంలో సమర్పించాల్సి వుంటుంది. లబ్దిదారుల ఎంపిక, రుణం మంజూరులో బ్యాంకు అధికారులకే కీలక పాత్ర. సబ్సిడీ నగదు విడుదలలో ఎటువంటి అక్రమాలు జరగకూడదన్న ఉద్దేశంతో కొత్త విధానానికి శ్రీకారం చుట్టినట్లు ఎస్సీ కార్పొరేషన్ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ డాక్టర్ సోమయ్య తెలిపారు.

# రోడ్లు త్రవ్వేస్తున్నా అడిగేవారు లేరు!

### పాత వేదాయపాళెంలో ఇదీ పరిస్థితి

లక్షలాది రూపాయల ప్రజాధనం ఖర్చుచేసి నిర్మిస్తున్న రోడ్లను కొందరు తమ స్వార్థం కోసం అడ్డదిడ్డంగా త్రవ్వి పారేస్తుండడంతో ప్రజలు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కోవలసి వస్తోంది. సిమెంటు రోడ్లు, గ్రావెల్ రోడ్లు ఏవి నిర్మించినా కార్పొరేషన్‌లో లక్షల రూపాయలు బిల్లులు చేసుకొంటున్నారు కాంట్రాక్టర్లు. ఈ పరిస్థితుల్లో ఎవరికి వారు తమ అవసరాల కోసం రోడ్లను అడ్డంగా త్రవ్వేస్తుండడంతో వేసిన కొన్నాళ్లకే అవి రూపురేఖలు కోల్పోతున్నాయి. అసలే నాసిరకంగా నాణ్యతకు తిలోదకాలిచ్చి ఈ రోడ్లను కాంట్రాక్టర్లు నిర్మిస్తుంటే, ప్రైవేటు వ్యక్తులు స్వలాభం కోసం ఆ రోడ్లను ఇష్టానుసారంగా ధ్వంసం చేసేస్తుండడంతో ప్రజలు రాకపోకలకు తీవ్ర ఇబ్బందులు పడాల్సి వస్తోంది. 23వ డివిజన్ పరిధిలో గల పాత వేదాయపాళెంలో గ్రావెల్ రోడ్లను లక్షల రూపాయలు ఖర్చుచేసి నిర్మించారు. ఈ ప్రాంతంలో ఒక వ్యక్తి ఇంట్లో డ్రైనేజి సిస్టం ఏర్పాటు చేసుకోను దాన్నుంతటిని రోడ్లోకి ప్రవహించేలా పెద్ద పెద్ద పైపులు ఏర్పాటు చేశారు. ఇందుకోసం బాగుండే రోడ్లను మోకాలిలోతున త్రవ్వి పారేయడంతో రోడ్డు మొత్తం ఛిద్రమై పోయింది. రైల్వే గేటును ఆనుకొని వుండే రహదారి కావడంతో రాకపోకలు సాగించే వాళ్లు తీవ్ర అసౌకర్యానికి గురౌతున్నారు. ఈ రోడ్డును అక్రమంగా త్రవ్వేస్తుండడంపై స్థానికులు కార్పొరేషన్ అధికారులకు ఫిర్యాదుచేయగా వాళ్లు అక్కడ విధులు నిర్వహించే వర్క్ ఇన్స్‌పెక్టర్‌ను పంపగా అతను అక్రమంగా రోడ్డు త్రవ్వి డ్రైనేజి పైపులు ఏర్పాటు చేసుకొనే వ్యక్తితో లోపాయికారి ఒప్పందం చేసుకొని ఫిర్యాదుదారులపైనే దబాయింపుకు దిగాడట. గ్రావెల్ రోడ్డు కదా త్రవ్వితే ఏమవుతుంది అని నిర్లక్ష్యంగా సమాధానం చెప్పడంతోపాటు దీనిపై ఎవరికైనా చెప్పుకోండి అని తలబిరుసు సమాధానమివ్వడంపై స్థానికులు ఆగ్రహిస్తున్నారు. ఏ రోడ్డైనా ప్రజాధనంతో నిర్మించిందన్న జ్ఞానం అధికారులకు లేకపోవడం సిగ్గుచేటు.

# అమృత హస్తంకు అడ్డంకులు!

### ● సరుకులు కొనలేక సతమతం

స్త్రీ, శిశు సంక్షేమ శాఖ ఆధ్వర్యంలో నిర్వహిస్తున్న అంగన్‌వాడీ కేంద్రాల్లో జూలై 1 నుంచి అమృతహస్తం పథకం ద్వారా మధ్యాహ్న భోజనం అమలు చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. 3 – 6 సంవత్సరాలలోపు పిల్లలు అంగన్‌వాడీ కేంద్రాలకు రప్పించాలన్న సంకల్పంతో భోజనం పెడుతున్నారు. ప్రభుత్వ సంకల్పం మంచిదే అయినా అమలు విషయంలో పథకం పురిటి నొప్పులు పడుతుంది. అంగన్‌వాడీ కేంద్రాలకు వచ్చే పిల్లలతోపాటు ఆయా గ్రామాల్లో వున్న బాలింతలు, గర్భిణీ స్త్రీలకు నెలకు సరిపడా సరుకులను ఒకే దఫా అందించాల్సి వుంటుంది. స్త్రీ, శిశు సంక్షేమ శాఖ అధికారులు మధ్యాహ్న భోజనానికి అవసరమైన అన్ని సరకులను అంగన్‌వాడీ కేంద్రాలకు ముందుగానే సరఫరా చేయాలి. కానీ ఏ కారణం చేతనో తెలియదుగానీ 80 కిలోల బియ్యం, కందిపప్పు మాత్రం అందించి చేతులు దులుపుకున్నారు. వీటి తయారీకి కావలసిన నూనె, ఇతర దినుసుల సరఫరా జరగలేదు. ఇంతే కాకుండా కూరగాయలు, ఆకుకూరలు అంగన్‌వాడీ కార్యకర్తలు కొనుగోలుచేసి వంట తయారు చేయాలని ఆదేశించారు. స్త్రీ, శిశు సంక్షేమ శాఖ మధ్యాహ్న భోజనానికి సంబంధించి జారీచేసిన మార్గదర్శకాలు అంగన్‌వాడీ కార్యకర్తలకందించలేదు. వంట సామాగ్రి కోసం 25 పైసలు, ఆకుకూరలు, కూరగాయలు కోసం 75 పైసలు ఖర్చు చేయాలి. బియ్యం, పప్పు, నూనె మొత్తం కలిపి ఒక పిల్లవాడికి రోజుకు 4 రూపాయలు ఖర్చు చేయాలని ఉత్తర్వుల్లో వుంది. ప్రస్తుతం బయట మార్కెట్లో కూరగాయలతోపాటు నిత్యావసర వస్తువుల ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. ప్రభుత్వం నిర్ణయించిన ధరలకు కొనుగోలు చేయడం సాధ్యపడదు. ఐసిడిఎస్ సిడిపిఓ, సూపర్‌వైజర్లు మధ్యాహ్న భోజన పథకం సామాగ్రిని అంగన్‌వాడీ వర్కర్లే కొనుగోలు చేయాలని నోటిమాటగా చెప్పి తప్పించుకుంటున్నారు. అసలే చాలీచాలని గౌరవ వేతనంతో కాలం గడుపుతున్న వర్కర్లపై ఇప్పుడు అదనపు భారం మోపడంతో ఏం చేయాలో దిక్కుతోచని స్థితిలో వున్నారు. గ్రామీణ ప్రాంతాల్లోని అంగట్లో అప్పులు పెద్దగా ఇవ్వరు. ప్రతి రోజు మధ్యాహ్న భోజనం కోసం నూనె, ఇతర పప్పుదినుసులు, కూరగాయలు కొనుగోలు చేయడం తమ వల్ల కాదని కొందరు అంగన్‌వాడీ కార్యకర్తలు వాపోతున్నారు. బియ్యం, పప్పు మినహాయిస్తే ఒక పిల్లవాడికి రూపాయి వంతున ప్రభుత్వం వర్కర్లకు చెల్లించే అవకాశం వుంది. కేంద్రంలో ఎంత మంది పిల్లలుంటే అన్ని రూపాయలు బిల్లు పెట్టుకోవాల్సి వుంటుంది. వేతనాలే సక్రమంగా చెల్లించని ఆ శాఖ ఉన్నతాధికారులు భోజనం బిల్లుల్ని ఏ మేరకు చెల్లిస్తారో వేచి చూడాలి. ఏది ఏమైనా అంగన్‌వాడీ కేంద్రంలో జూలై 1 నుంచి ప్రారంభమైన మధ్యాహ్న భోజన పథకానికి అధికారులు తూట్లు పొడవకుండా అమలు చేస్తే అందరూ సంతోషిస్తారు.

# కోవూరు సిఐ బదిలీ!

### విధి నిర్వహణలో వైఫల్యం

కోవూరు సిఐ రామారావు శాంతి భద్రతల విషయంలో పూర్తిగా వైఫల్యం చెందడం వల్లనే బదిలీ చేసినట్లు తెలుస్తుంది. కోవూరు సర్కిల్ పరిధిలో కోవూరు, కొడవలూరు, విడవలూరు, అల్లూరు పోలీస్ స్టేషన్లు వున్నాయి. తమ స్టేషన్ల ఎస్‌ఐలను ఎప్పటికప్పుడు సమన్వయం చేసుకుంటూ నేరాల నియంత్రణతో పాటు, కేసుల దర్యాప్తు వేగవంతంగా చేయాలి. కానీ సిఐ మాత్రం ఎస్‌ఐలతో సమన్వయం చేసుకునేందుకు పెద్దగా కృషి చేయలేక పోయారన్న విమర్శలు మూటగట్టుకున్నారు. సిఐకు అందిన ఫిర్యాదులు, ఉన్నతాధికారుల నుంచి సిఫార్సు చేసిన వినతి పత్రాలపై త్వరితగతిన విచారణ చేసేవారు కాదు. దీంతో జిల్లా ఎస్పీకి అధికంగా ఫిర్యాదులు వెళ్లేవి. సర్కిల్ పరిధిలో నేరాలు పెరగడంతో ఉన్నతాధికారులు సిఐ పని విధానంపై తీవ్ర అసంతృప్తి చెందారు. సిఐని మార్చకుంటే మరిన్ని సమస్యలు ఎదురవుతాయని ముందుగానే భావించి ఎస్పీ సిఐని బదలీ చేసేందుకు నిర్ణయించినట్లు సమాచారం. శాంతి భద్రతల విభాగం నుంచి పోలీస్ శిక్షణ కళాశాలకు బదలీ చేయించి ఆయన స్థానంలో దుగరాజపట్నం మెరైన్ సిఐగా విధులు నిర్వహిస్తున్న మాణిక్యరావును నియమించారు. త్వరలో జరగనున్న స్థానిక సంస్థల ఎన్నికలు దృష్టిలో వుంచుకుని ఈ నియామకం జరిపారు. కోవూరు సిఐగా వచ్చిన మాణిక్యరావుకు పోలీస్ శాఖలో సౌమ్యుడిగా పేరుంది. ఏ రాజకీయ పార్టీతోగానీ, నేతతోగానీ ఎటువంటి సంబంధాలు పెట్టుకోరు. తన పని తాను చేసుకుపోయే వ్యక్తి. కోవూరు నియోజకవర్గంలో తెలుగుదేశం, వైఎస్ఆర్‌సిపి, కాంగ్రెస్ పార్టీ నేతలు పోలీసు స్టేషన్లపై పెత్తనం చెలాయిస్తుంటారు. వారి మధ్యన మాణిక్యరావు విధి నిర్వహణలో ఎలా నెట్టుకు వస్తాడన్నది చర్చనీయాంశంగా మారింది.

### ● నెల్లూరులో

# సమాచార హక్కు చట్టం కమిషనర్!

### పెండింగ్ కేసుల విచారణ

రాష్ట్ర సమాచార హక్కు చట్టం కమిషనర్ మధుకర్ ఇటీవల నెల్లూరు నగరానికి వచ్చి పెండింగ్‌లో వున్న దరఖాస్తులపై జడ్పీ కార్యాలయంలో విచారణ జరిపారు. మునిసిపల్, అటవీ శాఖ, పోలీస్ శాఖ, దేవాదాయ శాఖలకు సంబంధించిన సమాచారం కోరిన వారికి సమాచారం అందించక పోవడంతో కమిషనర్‌కు అప్పీల్ చేశారు. ఈ అప్పీళ్లపై విచారణ చేసేందుకు విచ్చేసిన ఆయన ఉదయం నుండి సాయంత్రం వరకు పెండింగ్‌లో వున్న దరఖాస్తులను సమగ్రంగా పరిశీలించారు. నెల రోజుల్లోగా సమాచారం ఇవ్వాలన్న నిబంధన వున్నా గూడూరు మునిసిపల్ అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరించి, కమిషనర్‌కు అప్పీల్ చేసుకుని, విచారణకు వస్తున్న సమయంలో దరఖాస్తుదారుడికి కొంత సమాచారం అందించారు. ఈ విషయాన్ని కమిషనర్ దృష్టికి తీసుకెళ్లగా సమాచారం అందించడంలో నిర్లక్ష్యంగా వ్యవహరించి వుంటే చర్యలు తీసుకుంటామని స్పష్టం చేశారు. పోలీస్ స్టేషన్లలో వివిధ కేసులకు సంబంధించిన సమాచారం కోరితే రికార్డులు లేవని సాకుచూపి తప్పించుకొంటున్నారని ఫిర్యాదు అందింది. దీంతో రూరల్ పోలీస్ స్టేషన్‌లో ఆకస్మిక తనిఖీ చేశారు. అన్ని రికార్డులను పరిశీలించి సమాచార హక్కు చట్టాల అమలుకు ప్రతి ఒక్కరు కృషి చేయాలని ఆదేశించారు. రాష్ట్ర కమిషన్‌కే కమిషనర్‌గా వున్న రతన్, జడ్జీలు, అధికారులు సొంత ఆస్తుల వివరాలను వెల్లడించాలని ఆదేశాలిచ్చిన సంగతి తెలిసిందే. ఈ ఆదేశాలు జారీచేసిన నేపథ్యంలో ఆస్తులు కూడబెట్టుకున్న జిల్లా అధికారులకు వివరాలు అందించాలని దరఖాస్తులు అందుతున్నాయి. దీంతో అధికారుల్లో ఆందోళన మొదలైంది. ప్రతి సంవత్సరం వివిధ స్థాయిల్లో పనిచేస్తున్న అధికారులు, ఆస్తుల వివరాలు ప్రభుత్వానికి నివేదిక రూపంలో అందిస్తుంటారు.

## దివాలా అంచుకు

16వ పేజీ కొరవ

కోట్ల అప్పు పడింది. కానీ దాని ఆస్తులన్నీ లెక్క వేసినా ఐదు వందల కోట్ల రూపాయలు దాటడం లేదట. దాదాపుగా అన్ని సంస్థల పరిస్థితీ ఇదే. ఈ అప్పుల భారం మొత్తం ప్రభుత్వం, ఆ రూపంలో ప్రజలు మోయక తప్పడం లేదు. దాని ఫలితం మొత్తం ఆర్థిక వ్యవస్థ మీద విషతుల్యంగా మారుతున్నది.

### పారిశ్రామికవేత్తలపై ప్రేమ

సాధారణ వ్యాపారులు, చిన్న పరిశ్రమల యజమానులు బ్యాంకులకు బాకీ పడితే, నడివీధిలో నిలబెట్టి వసూలు చేస్తారు. సెక్యూరిటైజేషన్ వంటి క్రూరమైన చట్టాలను ప్రవేశపెట్టి రోజుల వ్యవధిలో ఆస్తులు అమ్మి పారేస్తున్నారు. కానీ వేల కోట్ల రూపాయల అప్పులు తీసుకొని క్రికెట్ బెట్టింగులకు, ప్రైవేటు విమానాలకు, విలాసవంతమైన విందు వినోదాలకు వ్యయం చేసిన బడా పారిశ్రామికవేత్త దగ్గరకు వెళ్లడానికే భయపడుతున్నాయి బ్యాంకులు. వారి అప్పులు రాని బాకీలుగా ప్రకటిస్తే తమ బ్యాలెన్స్ షీట్‌లు దెబ్బ తింటాయన్న భయంతో రావని తెలిసిన అప్పులను కూడా సక్రమమైనవిగా చూపించి రోజులు నెట్టుకొని వస్తున్నాయి.

దేశంలోని 30 అది పెద్ద బాకీదారుల మీద చర్యలు తీసుకోబోతున్నామని సాక్షాత్తు ఆర్థికమంత్రి చిదంబరం ప్రకటించాడంటే, బడా పారిశ్రామికవేత్తల పట్ల బ్యాంకుల కున్న బలహీనత ఏమిటో అర్థం చేసుకోవచ్చు.

దేశ ఆర్థిక వ్యవస్థ దివాలా స్థితికి చేరుకోవడానికి ప్రైవేటు రంగం సంస్థల దురాశా పూరిత వైఖరి కూడా ఒక కారణం కావడం క్షమించరాని నేరం.

### పీల్చి పిప్పి చేసిన అవినీతి కుంభకోణాలు

మన్మోహన్‌సింగ్ ప్రభుత్వం – చరిత్రలో అత్యంత అవినీతివంతమైన పాలనగా నిలిచి పోబోతున్నది. ఈ తొమ్మిదిన్నరేళ్లలో బయటపడిన అవినీతి కుంభకోణాలు దేశ ఆర్థిక వ్యవస్థ మూలుగులను పీల్చి పిప్పి చేశాయి. ప్రభుత్వం అవినీతి మయం అని తేలిపోవడంతో నిజంగా వ్యాపారం చేయాలనే సదుద్దేశ్యంతో భారతదేశానికి రావాలను కొన్న విదేశీ సంస్థలు వెనక్కు పోతున్నాయి. దేశం పరువు గంగలో కలిసిపోయింది. దాని ప్రభావం ఆర్థిక అభివృద్ధి మీద విశేషంగా కన్పిస్తున్నది.

విదేశీ అప్పులు చేయడంలో కూడా మన్మోహన్‌సింగ్ క్రమశిక్షణ పాటించలేదు. 2008లో మన స్వల్పకాలిక రుణాల మొత్తం 53 బిలియన్ డాలర్లు మాత్రమే. ఆనాటికి వున్న మొత్తం విదేశీ మారక ద్రవ్య నిల్వలో దాని శాతం కేవలం 17 మాత్రమే. కానీ ఈ రోజు ఏడాది లోపల చెల్లించ వలసిన అప్పుల మొత్తం 172 బిలియన్ డాలర్లు. ఈనాటి మొత్తం విదేశీ మారక ద్రవ్య నిల్వలో దీని శాతం 65 అంటే, రేపు మార్చి నెలలో అప్పులన్నీ చెల్లిస్తే, విదేశీ మారక ద్రవ్య నిల్వ కరిగిపోయి, ఒకటి రెండు నెలలకు మించి పెట్రోల్ దిగుమతికి కూడా వెతుక్కోవాల్సిన అగత్యం ఏర్పడుతుందన్న మాట. దేశం దివాలా తీసిందనడానికి ఇంతకంటే సంకేతం అవసరం లేదు.

ఈ ఆపద నుంచి దేశాన్ని రక్షించాలంటే ప్రభుత్వం చాలా చాలా కఠిన నిర్ణయాలు తీసుకోవాల్సి వుంటుంది. కానీ పార్లమెంట్ ఎన్నికలు సమీపించినందువల్ల ఆర్థిక వ్యవస్థ బాగోగులు పక్కనపెట్టి, ఓట్లు సంపాదించుకొనే కుటిల ప్రయత్నాలకు పెద్దపీట వేస్తున్నది యూపిఏ ప్రభుత్వం. హడావుడిగా ఆహార భద్రత చట్టాన్ని ఆర్డినెన్స్ రూపంలో అమలు చేయడం ఇందులో ఒక భాగం.

### ఉద్యోగాలు తగ్గిపోతున్నాయి!

2000 నుంచి 2005 మధ్యకాలంలో దేశంలో దాదాపు 6 కోట్ల కొత్త ఉద్యోగాల సృష్టి జరిగింది. కానీ 2004 నుంచి 2009 మధ్య కాలంలో కొత్త ఉద్యోగాల సృష్టి కేవలం 27లక్షలు మాత్రమే. దేశ జనాభాలో దాదాపు 10 శాతం మంది నిరుద్యోగులుగా మిగిలిపోయి వున్నారని అంచనా. ఇంజనీరింగ్, ఎంబిఏ వంటి వృత్తి విద్య అభ్యసించిన యువకులు కూడా లక్షల సంఖ్యలో నిరుద్యోగులుగా కాలం గడపవలసి వస్తున్నది. నిరుద్యోగం వల్ల కుటుంబ స్థాయిలో కొనుగోలు శక్తి క్షీణిస్తుంది. దాని ఫలితంగా పరిశ్రమల ప్రగతి పడిపోతుంది. దానితో మరింత నిరుద్యోగం పెరుగుతుంది. ఇది కూడా ఒక విష వలయమే.

ఒక పక్క పెరిగే నిత్యావసర వస్తువుల ధరలు మరొకప్రక్క పతనమై పోతున్న రూపాయి విలువ కరిగిపోతున్న విదేశీ మారక ద్రవ్య నిల్వలు, భరించరాని భారంగా మారుతున్న అప్పుల మొత్తం, అదుపు తప్పుతున్న నిరుద్యోగం, మందగిస్తున్న పారిశ్రామిక అభివృద్ధి, కుంటు పడుతున్న వ్యవసాయ ప్రగతి వంటివన్నీ ఆర్థిక వ్యవస్థను అతలాకుతలం చేస్తున్నాయి. మన్మోహన్‌సింగ్ ఆర్థిక ప్రావీణ్యం అంతా ఏమైపోయిందో, తన చేతులతో తానే ఎందుకింతగా దేశాన్ని పాతాళానికి దిగజారుస్తున్నాడో అర్థమే కావడం లేదు. ఆర్థిక సంస్కరణల విషయంలో తనకు పూర్తి స్వేచ్ఛ ఇవ్వకపోవడం వల్లనే ఆర్థిక ప్రగతి సాధించలేక పోయానని చెప్తున్నాడు ప్రధాని. కానీ అదొక కుంటి సాకు మాత్రమే. అమెరికా మీద ఎనలేని మమకారంతో వారికి అనుకూలమైన అణు ఒప్పందాన్ని బలవంతంగా అమలు చేయించిన ప్రధా నికి ఆర్థిక వ్యవస్థ బాగు కోరే చర్యలకు అడ్డంకులు ఎట్లా వస్తాయి? ఎవరడ్డం పెట్టినా చిల్లర వర్తకంలో విదేశీ పెట్టుబడులను ఆపలేదు కదా ఆయన.

రాజకీయ ప్రయోజనాల కోసం, ఓట్ల సంపాదన కోసం దిక్కుమాలిన పథకాలు ప్రవేశపెట్టి వాటి పేరుతో లక్షల కోట్ల రూపాయలు అనుత్పాదక రంగాలకు దుబారా చేయడం వల్ల, అవినీతిని అదుపు చేయలేని నిస్సహాయత వల్లనే ఈ రోజు దేశ ఆర్థిక రంగం దివాలా స్థితికి చేరుకొందనడంలో అణుమాత్రం సందేహం లేదు. ఇది పూర్తిగా ప్రభుత్వం చేసిన మహాపరాధం. కానీ దాని దుష్ప్రభావాన్ని అనుభవించవలసింది మాత్రం అమాయక ప్రజలు.





**లోకకళ్యాణార్థం భద్రాచలం క్షేత్రం నుండి బయలుదేరి పెంచలకోన క్షేత్రానికి చేరిన విష్ణుస్వరూపం (తోడపెద్ది)కి స్వాగతం పలుకుతున్న దేవస్థానం ఛైర్మన్ చెన్ను తిరుపాల్‌రెడ్డి.**

## తెలంగాణ నిజమా, నాటకమా?

మొదటి పేజీ కొరవ

ఒక్క స్థానంలో కూడా గెలవలేని పరిస్థితి ఏర్పడినా ఆశ్చర్యం లేదు. ఈ అంచనా కాంగ్రెస్ పెద్దలకు తెలియకుండా పోతుందా? అందువల్లనే ఈ ప్రయత్నం నిజమా నాటకమా అన్న సందేహం కలగడం. ప్రత్యేక రాష్ట్రం కోరుతూ శాసనసభలో తీర్మానం ప్రతిపాదించమని చెప్పబోతున్నదట సోనియాగాంధీ. శాసనసభలో ఆంధ్ర ప్రాంతానికి చెందిన స్థానాల సంఖ్య 175; తెలంగాణాను వ్యతిరేకించే హైదరాబాద్, రంగారెడ్డి జిల్లాలకు చెందినవారు మరొక పాతిక మంది వరకు వున్నారు. తీర్మానానికి ఓటు విషయంలో ఏ పార్టీ కూడా విప్ ఇవ్వలేదు. ఎమ్మెల్యేల అంతరాత్మ ప్రభోదం ప్రకారం ఓటు చేయమంటారు. దానితో తీర్మానం ఓడడం ఖాయం. ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటుకు రాజ్యాంగ నియమం ప్రకారం శాసనసభ తీర్మానం అవసరం లేదు. కానీ సోనియా అంతరంలో తెలం గాణ ప్రకటన అనేది ఒక నాటకమైతే మాత్రం ఈ తీర్మానం సాకుగా చూపించి, మెజార్టీ అభిప్రాయానికి విరుద్ధంగా వుందనే సాకు చూపించి, పక్కకు తప్పుకోవచ్చు. తెలంగాణ ఇవ్వడానికి చిత్తశుద్ధితో ప్రయత్నం చేసినందువల్ల ప్రజలలో సానుభూతి సంపాదించి, ఇవ్వకుండా కాలయాపన చేయవచ్చు. చివరకు జరిగేది అదే అని పరిశీలకుల అభిప్రాయం.

## రాజకీయ బదలీలే?

మొదటి పేజీ కొరవ

యాలు నూరుతూనే వుండినాడు ఈ రెండేళ్ల కాలం. మొన్నటికి మొన్న పంచాయితీ ఎన్నికల కోసం ముఖ్యమంత్రి సమక్షంలో జరిగిన సమావేశంలో కూడా అన్నదమ్ములిద్దరి ప్రధాన ఫిర్యాదు ఎస్పీ మీద కావడం, ఈ విషయంలో వారెంత అవమానానికి గురైనారో చెప్పకనే అర్థమౌతున్నది. ఎన్నికల సమయంలో మంత్రి మనసు కష్టపెట్టడం భావ్యం కాదనే ఉద్దేశ్యంతో ఎట్టకేలకు ఎస్పీ బదలీ నిర్ణయం తీసుకొన్నాడు ముఖ్యమంత్రి.

రమణకుమార్ పొరపాటున పోలీస్ శాఖకు వచ్చిన సాధుజీవి. ఆయనలో ఆ వృత్తి పరమైన కాఠిన్యం, కరుకుదనం అణుమాత్రం కన్పించవు. కానిస్టేబుల్‌ను సైతం మర్యాదగా పలకరించే ఉత్తమ సంస్కారి. ఆ మంచితనం ఆయనకు పలుమార్లు ఇబ్బందులు తెచ్చి పెట్టింది. పోలీసు విధుల సంగతి పక్కన పెడితే బోడిగాడితోట స్మశానంలో శవాల పక్కన జీవచ్ఛవాల వలె బ్రతికే పసి పిల్లల జీవితాలలో వెలుగు నింపడం కోసం రమణకుమార్ పడిన తాపత్రయం, చేసిన కృషి మాత్రం చాలా కాలం జిల్లా ప్రజలకు గుర్తుండి పోతాయి. ఒక అధికారిగా కాక, ఒక మంచి మనిషిగా జ్ఞాపకం పెట్టుకోవలసిన వాడు రమణకుమార్.

జిల్లా కలెక్టర్ శ్రీధర్ వివాద రహితుడు. ఆయనతో మంత్రికి కానీ, ఇతర కాంగ్రెస్ వాదులకు కానీ ఎటువంటి ఇబ్బందులూ తలెత్తలేదు. అయితే ఆయన తన జిల్లాకు కావాలని కోరుకొన్నారు మాజీ హోం మంత్రి సబితా ఇంద్రారెడ్డి. ఆయన బదలీకి ప్రధాన కారణం అదే. అయితే ఈ విషయాన్ని ముందుగానే గ్రహించిన రామనారాయణరెడ్డి ఈ మధ్య కొంతకాలంగా శ్రీధర్ మీద విసుగు ప్రదర్శించాడు. నీకై నువ్వే బదలీ చేయించుకొని వెళ్లిపో అని హూంకరించాడట కూడా. ఎటూ బదలీ తప్పదు కాబట్టి, తన అభిమతం ప్రకారం జరిగిందని చెప్పుకోవడానికి ఆయన చేసిన చిన్నపాటి రాజకీయ ప్రయోగం అది. శ్రీధర్ వ్యక్తిగా మంచివాడు. కలెక్టర్‌గా మాత్రం చెప్పుకోదగినది ఏదీ లేదు.

కొత్త కలెక్టర్ శ్రీకాంత్ అనుభవజ్ఞుడు. మునిసిపల్ కమిషనర్, ఐటిడిఏ పిఓ, సబ్ కలెక్టర్, జాయింట్ కలెక్టర్, కలెక్టర్ వంటి పదవులన్నీ నిర్వహించిన వాడు. మనిషి కూడా నాజూకుగా, నైస్‌గా వున్నాడు. ఐఎఎస్ దర్పం, షోకు ఆయనలో స్పష్టంగా కన్పిస్తున్నాయి. అది పైపై మెరుగో లేక నిజంగానే కలెక్టర్‌గా తన ప్రతాపం చూపుతాడో వేచి చూద్దాం.

కొత్త ఎస్పీ రామకృష్ణ గతంలో గూడూరు డిఎస్పీగా పనిచేసి వెళ్లాడు. అందువల్ల జిల్లా గురించి కొంత అవగాహన వుంటుంది. కొత్త అధికారులిద్దరికీ సాదర స్వాగతం చెప్తున్నాము.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

య్యారు. రాధాకృష్ణ ఎబివిపి, బిజెవైఎంలో పలు బాధ్యతలు నిర్వహించిన అనుభవశాలి.

## తరుణేందు శేఖర్‌రెడ్డి మరణం

కళాప్రపూర్ణ మరుపూరు కోదండరామిరెడ్డి ఏకైక కుమారుడు తరుణేందు శేఖర్‌రెడ్డి(68) జూన్ 27వ తేది అమెరికాలో మరణించారు. సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో ఆఫీసర్‌గా పనిచేసి రిటైర్ అయిన ఆయన నెల్లూరులో ప్రోగ్రెసివ్ ఫిల్మ్ సొసైటీ ప్రారంభించి పదేళ్లు నడిపారు. మేనత్త పొణకా కనకమ్మ స్వీయ చరిత్ర వెలుగులోనికి తెచ్చారు. ఆయనకు భార్య, కొడుకు, కుమార్తె వున్నారు. ఆత్మీయుడ్ని కోల్పోయిన వారి కుటుంబానికి మా సానుభూతి.

## పదరంగం -74

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | 3 | | 4 | 5 | | 6 | 7 |
| | | | 8 | | | | | 9 | |
| 10 | | 11 | | | | | 12 | | |
| | | | | 13 | | | | | |
| 14 | 15 | | | | | | 16 | 17 | |
| 18 | | | 19 | | 20 | | | | |
| | | 21 | | | | | | | 22 |
| | 23 | | | | 24 | 25 | 26 | | |
| 27 | | | | 28 | | 29 | | | |
| 30 | | | | 31 | | | | 32 | |

**అడ్డం**

1. శిరసావహింప వలసినది (4)
4. బుద్ధికి పుట్టిన ఉపాయాలు (5)
8. కాలయాపన (4)
9. ఉత్తరాది జిల్లాలలో పెదమ్మ ఇలాగే పిలుస్తారు (2)
10. విన్నపం (3)
13. వినయం, అణగి వుండడం (4)
14. సర్వం, అన్నీ (3)
16. పూలతోట అటునుంచే క్లుప్తంగా (3)
18. మట్టి (2)
19. ఆధిక్యం కలవాడు (4)
21. అమ్మ (2)
23. సమాచారం, ఎరుకల సాని చెప్పేది (3)
24. అటునుంచే జాగ్రత్త (3)
27. అల్మయిరా (3)
29. గోదావరి ఒక... (2)
30. వరిపొట్టుతో చేసిన పశువుల మేత అటునుంచి (3)
31. వంద (3)
32. సర్పము (2)

**నిలువు**

2. ఏడుపు (2)
3. క్రింద నుంచి పని (2)
4. ఆక్షేపించబడినది (4)
5. లోపించబడినది (2)
6. క్రింద నుంచి ఆజ్ఞ (2)
7. క్రింద నుంచి శాఖలు (3)
11. సంకుచితం, ఇరుకు కాదు (3)
12. క్రింద నుంచి తువ్వాలు ఇంగ్లీషులో (3)
13. సమయం, గడువు (3)
14. యుద్ధం, విజయవాడ సెక్సాలజిస్టు (3)
15. నేత్రం (2)
17. అట్టు, ఇడ్లీతో పాటిది (2)
19. అల్లబడినది (3)
20. క్షేమం (3)
21. పిదప, ఆ పిమ్మట (4)
22. కుక్క (4)
23. చేనుకు చేవనిచ్చేది (3)
25. రోజు (3)
26. రెండ్డెదులు (2)
27. బంజరు కాదు (2)
28. దిక్కు (2)

**సమాధానాలు**

## పదరంగం -73

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 స | రో | 2 వ | 3 రం | | 4 శ్రీ | కా | 5 ళ | హ | 6 స్తి |
| దా | | 7 చే | గు | 8 వే | రా | | ఊ | | శ |
| 9 చా | 10 రు | | | 11 మ | మ | 12 త | | 13 జ్ఞ | ప్ర |
| 14 రం | తా | 15 గం | | న | | 16 యం | 17 దా | ఆ | |
| | | 18 డం | 19 అం | | 20 వ | ని | త | | 21 లు |
| 22 కి | | | 23 బు | 24 లా | కీ | | | 25 ఆ | ట |
| 26 న్నె | 27 క | | 28 ల | లీ | లు | | 29 తు | రం | గం |
| 30 ర | మే | 31 లి | పో | | | 32 శ | ల | భం | |
| సా | | 33 ఆ | ది | 34 వా | 35 రం | | | | 36 త్తో |
| 37 ని | ప్పు | | | 38 ది | వా | ణం | | 39 గా | యం |

# దక్షిణాదిలో తయారైన తొలి సినిమా కీచకవధ!

విదేశాల నుంచి బొంబాయి స్ఫూర్తి పొందితే... బొంబాయిని చూసి దక్షిణాది ప్రభావిత మయింది. పాల్కే స్ఫూర్తితో మనమూ సినిమా తీయాలనే ఆలోచన దక్షిణాదిలోని కార్ల దిగుమతి వ్యాపారి ఆర్.నటరాజ మొదలియార్‌కు కలిగింది. ఆయన చిత్ర నిర్మాణం గురించి అన్ని విషయాలు తెలుసుకుని మదరాసులో 'ఇండియన్ ఫిలిం కంపెనీ'ని స్థాపించి, 'కీచకవధ' అనే మూకీ కథా చిత్రాన్ని నిర్మించాడు. ఆ చిత్ర నిర్మాణానికి ఆయనకు ఆరు నెలలు పట్టింది. 35వేలు పెట్టుబడి పెట్టాడు. 1918లో చెన్నైలోని 'ఎల్ఫిన్ స్టన్ థియేటర్'లో కీచకవధ విడుదల అయ్యింది. యాభైవేల రూపాయలు వచ్చాయి. ఆ ఉత్సాహంతో ఆయన రెండవ సినిమా 'ద్రౌపది వస్త్రాపహరణము' తీయడానికి ప్లాన్ చేశాడు. అయితే ద్రౌపది పాత్ర వేయడానికి ఇక్కడి మహిళలు ఒప్పుకోలేదు. అందుకని 'వైలట్‌బేరి' అనే ఆంగ్ల వనిత ను ఒప్పించి, ఆ పాత్రకు సిద్ధం చేశాడు. 'ద్రౌపది వస్త్రాపహరణము' అనే ఈ మూకీ కథా చిత్రం 1918లో విడుదలై ఘన విజయం సాధించింది.

### తెలుగు సినిమా చరిత్ర


రఘుపతి వెంకయ్య.

ప్రసిద్ధ సంఘ సంస్కర్త రఘుపతి వెంకటరత్నం గారి తమ్ముడు రఘుపతి వెంకయ్య. మదరాసులోని మౌంట్‌రోడ్‌లో వెంకయ్యకు అప్పట్లో ఓ ఫోటో స్టూడియో వుండేది. 'సినిమా ప్రదర్శన'ను దక్షిణ భారత దేశానికి పరిచయం చేయాలన్న సంకల్పంతో ఆయన వివరాలన్నీ సేకరించి మదరాసులోనే వున్న 'జాన్ డికెన్‌సన్ అండ్‌కో' వారి ద్వారా ప్రదర్శనకు అవసరమైన పరికరాలు, చిత్రాలు దిగుమతి చేయించాడు. 1909లో మదరాసు హైకోర్టు సమీపంలో ఓ గుడారాన్ని నిర్మించి, అక్కడ తను దిగుమతి చేసుకున్న మూకీ చిత్రాలను ప్రదర్శించడం ప్రారంభించాడు. తర్వాత 1912లో మదరాసులోని హారీస్ రోడ్‌లో "గెయిటీ థియేటర్" నిర్మించాడు. ఆ తర్వాత "క్రౌన్", "గ్లోబ్" థియేటర్లు కట్టించాడు. అయినా తెలుగువాడిగా తను కూడా స్వయంగా ఒక సినిమా తీయాలనే పట్టుదల వెంకయ్యకు కలిగింది. దాంతో చిత్ర నిర్మాణం పట్ల సమగ్ర అధ్యయనం చేయమని తన కొడుకు ఆర్.ఎస్.ప్రకాశ్‌ను విదేశాలకు పంపించాడు. ఆ తర్వాత తిరిగి వచ్చిన ప్రకాశ్ ఒక స్టూడియోను కట్టించాడు. 'స్టార్ ఆఫ్ ద ఈస్ట్ ఫిలిమ్స్' అనే సంస్థను స్థాపించి, ప్రకాశ్ దర్శకత్వంలోనే "భీష్మ ప్రతిజ్ఞ", "గజేంద్ర మోక్షం", "నందనార్" మూకీ చిత్రాలను నిర్మించాడు. ఆ విధంగా తండ్రీ కొడుకులు తొలి రోజుల్లో తెలుగు సినిమా నిలదొక్కుకోవడానికి బలమైన పునాదులు వేసి అద్భుతమైన కృషి చేశారు. అందుకే కేంద్ర ప్రభుత్వం "పాల్కే" పేరుతో లబ్ధప్రతిష్టులను గౌరవిస్తుండగా, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం "రఘుపతి వెంకయ్య అవార్డు"తో సత్కరిస్తూ వుంటుంది.

### సెన్సారు పద్ధతి

సినిమాకు సెన్సార్ నిబంధనలుండాలనే ఆలోచన బ్రిటీష్ ప్రభుత్వానికి 1917లో వచ్చింది. మన వారు అందుకు అసమ్మతి తెలిపారు. అయినా 1918లో "ఇండియన్ సినిమాటోగ్రాఫి యాక్ట్"ను ఒక చట్టంగా చేసి, అమలులో పెట్టారు.

### టాకీ చరిత్ర

అమెరికాలో తయారైన టాకీ చిత్రం "మెలడీ ఆఫ్ లవ్" మన దేశంలో బొంబాయి, కలకత్తా నగరాలలో విడుదలై ప్రేక్షకులను పరవశింపజేసింది. ఆ చిత్రాన్ని చూసిన ఖాన్‌బహదూర్ ఆర్దేషిర్ ఎమ్.ఇరానీ తొలి టాకీ కథా చిత్రం తీయాలని నిర్ణయించుకున్నాడు. ఆయన మన దేశంలో అమెరికాలోని యూనివర్శిల్ పిక్చర్స్‌కి పంపిణీదారు.



MAJESTIC
-TALKIES-
-- Commencing Saturday 14th March 1931 --
IMPERIAL MOVI-TONE
100% TALKIE PICTURE
ALAM-ARA
FEATURING :-
ZUBEDA - VITHAL - ELIZAR - ZILLOO - PRITHVIRAJ AND AN ALL STAR CAST.
Daily Three Shows at 5-30, 8 and 10-30 p. m.
Sat. Sun. and Bank Holidays 3 p. m.
Tickets will charged for children over 3 years.
Management reserves the right of changing the Programme without previous notice.
Money will not refunded in case of any accident.
Those who purchase tickets outside the theatre shall not be admitted.
Box 3-6-0 Reser. 1-8-0 Second 0-9-0
Bal. 2-4-0 First 1-2-0 Third 0-4-0
Every Sunday special show at 10 A. M. for School Boys and Girls.

ఆలం - ఆరా విడుదల పోస్టర్.

ఆయన మొదటిసారి 'వీరాభిమన్యు' అనే మూకీ చిత్రాన్ని తీశాడు. ఆ తర్వాత 'ఇంపీరియల్ ఫిలిం స్టూడియో'ను నెలకొల్పారు. అప్పట్లో విజయవంతమైన 'ఆలం ఆరా' అనే రంగ స్థల నాటకం హక్కులు తీసుకుని జోసెఫ్ డేవిడ్ అనే రచయిత చేత వెండితెరకు అనుగుణంగా రాయించుకున్నాడు. అలా 'ఆలం ఆరా' టాకీ హిందీ చిత్రం నిర్మాణమై 1931 మార్చి 14వ తేదీన బొంబాయిలోని 'మెజిస్టిక్ థియేటర్'లో విడుదలై సూపర్‌హిట్ అయ్యింది. 'ఆలం ఆరా'లో డబ్ల్యుఎమ్ ఖాన్ అనే నటుడు ఫకీర్‌గా నటిస్తూ "దేదే ఖుదాక్ నామ్‌పర్ ప్యారే" అనే పాట పాడారు. అదే తొలి హిందీ టాకీలోని తొలిపాటగా చరిత్ర కెక్కింది.

### తొలి తెలుగు టాకీ

ఆర్దేషిర్ ఇరానీ వద్ద సహాయ దర్శకుడిగా


భక్త ప్రహ్లాద చిత్రంలోని ఒక దృశ్యం.

పనిచేస్తున్న హనుమంతప్ప మునియప్పరెడ్డి ఆ తర్వాత హెచ్.ఎం.రెడ్డిగా ప్రసిద్ధులు. తొలి తెలుగు టాకీ "భక్త ప్రహ్లాద", తొలి తమిళ టాకీ "కాళిదాసు" దర్శకత్వ బాధ్యతను అప్పగించారు. అలా తొలి తెలుగు టాకీ బొంబాయిలో తయారై 1932 ఫిబ్రవరి 6వ తేదీన బొంబాయిలో, ఏప్రెల్ 2వ తేదీన మదరాసులో, ఆ తర్వాత ఆంధ్రరాష్ట్రంలో విడుదలయ్యింది. ఆ చిత్రంలో ఒక ఘట్టంలో హిరణ్యకశిపుడి భార్య "పరితాప భారంబు భరియింప తరమా" అని ఒక పాట పాడుతుంది. అదే తొలి తెలుగు సినిమా పాట. ఆ పాటను చందాల కేశవదాసు రాశాడు. ఆయనే తొలి తెలుగు సినిమా గీత రచయిత.

### దక్షిణ భారతంలో - ఆంధ్రరాష్ట్రంలో

తెలుగు టాకీ నిర్మాణం 1934లో దక్షిణ భారత దేశానికి వచ్చేసింది. పి.వి.దాసు గారు మదరాసులో 'వేలు పిక్చర్స్ స్టూడియో' నిర్మించి చిత్రపు నరసింహారావు దర్శకత్వంలో 'సీతా కళ్యాణం' తీయించారు. మదరాసులో తయారైన తొలి టాకీ చిత్రం యిదే. అయితే తెలుగు సినిమాను అసలు సిసలైన తెలుగు నేలపై తీయాలని సంకల్పించి నిడమర్తి సూరయ్య గారు 1936లో రాజమండ్రిలో దుర్గా సినీ స్టూడియోను స్థాపించి మొదట 'సంపూర్ణ రామాయణం' చిత్రాన్ని, ఆ తర్వాత 'సత్యనారాయణ వ్రతం' మరియు 'మోహినీ భస్మాసుర' చిత్రాలను నిర్మించారు.

**వందేళ్ల సినిమాకు వందనం**
**జయంపు కృష్ణ**

అలాగే విశాఖపట్నంలో 'ఆంధ్రా సినీటోన్' అనే స్టూడియోను నెలకొల్పడం జరిగింది. అక్కడ 1938లో 'భక్త జయదేవ', 1939లో 'పాశుపతాస్త్రం' చిత్రాలను నిర్మించారు. క్రమంగా రాజమండ్రి, విశాఖపట్నంలోని స్టూడియోలు మూత పడ్డాయి. హైదరాబాద్‌లో శ్రీ సారథీ స్టూడియోస్‌లో 'మా ఇంటి మహాలక్ష్మి' చిత్రం నిర్మించడం జరిగింది. తరువాత హైదరాబాద్‌లో మరి కొన్ని స్టూడియోలు నెలకొన్నాయి.

(కొరవ వచ్చే వారం)

# దివాలా అంచుకు చేరుతున్న దేశం!

- మార్చి నెల లోపల కట్టవలసిన 10లక్షల కోట్ల రూపాయల విదేశీ అప్పులు దేశాన్ని తీవ్రమైన ఆర్థిక సంక్షోభంలోకి నెట్టి వేస్తున్నాయి.
- రూపాయి విలువ పతనం సామాన్యుడి జీవనాన్ని దుర్భరం చేయబోతున్నది.
- పారిశ్రామిక ప్రగతి మందగించడంతో నిరుద్యోగ భూతం యువతరాన్ని భయపెడుతున్నది.
- ప్రైవేటు పారిశ్రామికులు గనులు, భూములనే కాదు బ్యాంకులను కూడా దోచుకొంటున్నారు.
- మన్మోహన్ సింగ్ తొమ్మిదిన్నరేళ్ల పాలన భారత దేశాన్ని ఒక శతాబ్దం వెనక్కు తిరోగమింప చేసింది.

భారతదేశం భవిష్యత్తు ఏమిటి? నూటపాతిక కోట్ల ప్రజానీకం ముందు ముందు ఎటువంటి పరిస్థితులను ఎదుర్కోబోతున్నది? ఆర్థికంగా మన దేశాన్ని ప్రపంచ అగ్రభాగాన నిలబెడుతామని పాలకులు చేసే ప్రకటనలలో వాస్తవమెంత? నిజంగా మన ఆర్థిక వ్యవస్థ ప్రగతి పథంలో శిఖరాగ్రానికి దూసుకపోతున్నదా లేక పాతాళానికి పతనమై పోతున్నదా? అంతర్జాతీయ స్థాయిలో ఆర్థికవేత్తగా కీర్తి ప్రతిష్టలందుకొన్న మన్మోహన్‌సింగ్ ప్రధానమంత్రిగా తొమ్మిదిన్నరేళ్ల పాలన తర్వాత యావత్ జాతిని వేధిస్తున్న ఆందోళన ఇది.

## ఆశ నిరాశయ్యింది!

మన్మోహన్‌సింగ్ మీద భారత జాతి చాలా పెద్ద ఆశలే పెట్టుకొన్నది. తొమ్మిదిన్నరేళ్ల క్రితం సోనియాగాంధీ ఆయన్ను ప్రధానిగా ప్రకటించినందుకు ప్రతిపక్షాలు కూడా హర్షం వ్యక్తం చేశాయి. అందుకు కారణం – ఆయన వ్యక్తిత్వ వైశిష్ట్యం ఒకటైతే, ఆర్థికశాస్త్ర ప్రావీణ్యం రెండవది. చంద్రశేఖర్ పాలనతో దేశ ఆర్థిక వ్యవస్థ కుప్పకూలి, బంగారు తాకట్టు పెట్టి అప్పులు చెల్లించవలసిన దుర్గతికి దిగజారిన సమయంలో సంస్కరణల ద్వారా ఆర్థిక వ్యవస్థను గాటిలో పెట్టాడన్న నమ్మకం ఆయనపై ఆశలు పెంచుకోవడానికి దోహదపడింది. అయితే ఈ తొమ్మిదిన్నరేళ్లలో ఆ ఆర్థిక ప్రావీణ్యుడు దేశాన్ని మరొకసారి అదే దుర్గతికి దిగజార్చడం విధి విచిత్రం.

## పరిస్థితి ఆందోళనకరం

ఇప్పటికిప్పుడు దేశ ఆర్థిక వ్యవస్థ ప్రయాణ గమనాన్ని గమనిస్తే చాలా ఆందోళన కలుగుతున్నది. భయం పుడుతున్నది. చంద్రశేఖర్ హయాం నాటి దారుణ రుణ వ్రణం ఆర్థిక వ్యవస్థను రోగగ్రస్థం చేస్తున్నది. రానున్న తొమ్మిది నెలల్లో, 2014 మార్చి లోపల మన ప్రభుత్వం చెల్లించి తీరవలసిన విదేశీ అప్పుల మొత్తం 172 బిలియన్ డాలర్లని రిజర్వ్ బ్యాంక్ ప్రకటించింది. రూపాయలలో దాని విలువ అక్షరాలా 10లక్షల కోట్లు. ఈ అప్పు కట్టకుంటే, మన దేశాన్ని దివాలా తీసినట్లు ప్రకటించాల్సి వస్తుంది. అదే జరిగితే కలిగే దుష్పరిణామాలు అంచనాకు కూడా అందవు. మన దేశానికున్న మొత్తం విదేశీ మారక ద్రవ్య నిల్వలలో ఇది 65శాతంతో సమానం. అంటే అప్పు కట్టిన తర్వాత బొక్కసం ఖాళీ అవుతుందన్న మాట. అదే జరిగితే పెట్రోల్ దిగుమతి చేసుకోవడానికి కూడా మన దగ్గర పైసలుండవు. ఏ ప్రపంచ ఆర్థిక సంస్థా కొత్త అప్పులివ్వదు. విదేశీ పెట్టుబడిదారులు మన వైపు కన్నెత్తి చూడరు. పై పెచ్చు షేర్ మార్కెట్‌లో తమకున్న పెట్టుబడులను వెనక్కు తీసుకొని వెళ్తారు. అదే జరిగితే షేర్ మార్కెట్ కుప్పకూలుతుంది. షేర్ల ధరలు పతనమైతే పరిశ్రమలు సంక్షోభంలో కూరుకపోతాయి. వారి అవసరాలకు అప్పులు పుట్టవు. పారిశ్రామిక ప్రగతి నాశనమైపోతుంది. దానితో నిరుద్యోగం పెరిగిపోతుంది. చెప్పుకొంటూ పోతే ఇదొక భయానకమైన విష వలయం. ఒకసారి ఆ చక్ర భ్రమణంలోకి జారితే, కోలుకోవడానికి ఎన్నేళ్లు పడుతుందో చెప్పడం కష్టం.

## అప్పులే కొంపముంచాయి

అభివృద్ధి కోరుకొనేవారు అప్పులు చేయక తప్పదు. వ్యక్తులైనా, సంస్థలైనా, ప్రభుత్వమైనా ఇదే సూత్రం వర్తిస్తుంది. కానీ చేసే అప్పు ఎందుకోసం వాడుతున్నారన్న దానిపై ఫలితం ఆధారపడుతుంది. అప్పుతో ఆస్తులు, రాబడి పెంచుకొంటే తిరిగి చెల్లించే స్థోమత సంపాదిస్తారు. అప్పుతో పప్పుకూడు తింటే, తిన్నది అరిగిపోతుంది. తప్ప అప్పు తీరదు. మన్మోహన్‌సింగ్ సర్కారు చేసిన అతి పెద్ద పొరపాటు ఇదే. ఆయన మీద వున్న గురి వల్ల అంతర్జాతీయ ఆర్థిక సంస్థలు అడిగిందే తడవుగా అప్పులిచ్చాయి. ఇప్పుడు మన దేశం మొత్తం విదేశీ రుణ భారం 390 బిలియన్ డాలర్లు. అంటే, 23లక్షల కోట్ల రూపాయలు. ఇంత అప్పు చేసి సాధించింది ఏమిటి అన్నది ప్రశ్న.

2004లో యూపిఏ ప్రభుత్వం ఆధికారంలోకి వచ్చే నాటికి మన ఆర్థిక అభివృద్ధి రేటు



దాదాపు 10శాతం. ఇప్పుడది 4.7 శాతానికి దిగజారిపోయింది. వ్యవసాయం వంటి కీలక రంగాలలో అభివృద్ధి తిరోగమనంలోకి దిగజారింది. పారిశ్రామిక ప్రగతి ఆందోళనకరంగా మారింది. సాఫ్ట్‌వేర్ వంటి సేవా రంగాలు వున్నాయి కాబట్టి, ఈ మాత్రం అభివృద్ధి రేటు నిలబడుతున్నది తప్ప లేకుంటే సున్నాకు చేరుకొనేది. ప్రభుత్వ పెట్టుబడులను ఉత్పత్తి పెంచే రంగాలలో కాకుండా ఓట్లు సంపాదించే పెట్టే ఖర్చులకు వాడడం వల్లనే ఈ దుర్గతి.

## ద్రవ్యోల్బణం అదుపు తప్పింది!

మరొకప్రక్క ద్రవ్యోల్బణం అదుపు తప్పిపోయింది. 2004లో మన్మోహన్‌సింగ్ పగ్గాలు చేపట్టే రోజు లీటర్ పెట్రోల్ ధర 33 రూపాయలా 27పైసలు. ఈరోజది 75 రూపాయలు దాటింది. డాలర్లతో రూపాయి మారక విలువ ఆనాడు 44 రూపాయలు; ఇప్పుడు 60 రూపాయలు. పెట్రోల్ ధరలు ద్రవ్యోల్బణానికి చిహ్నం. పెట్రోల్ ధరలతో అన్నిరకాల నిత్యావసర వస్తువుల ధరలూ ముడిపడి వుంటాయి. అది పెరిగితే అవీ పెరుగుతాయి. రూపాయి మారక విలువ ఆర్థిక వ్యవస్థ పటిష్టతకు సంకేతం. అది పతనం కావడం అంటే, వ్యవస్థ దివాలా తీయడం క్రిందే లెక్క. రూపాయి విలువ పడిపోతే, దిగుమతులు ఖరీదుగా మారుతాయి. దానితో పెట్రోల్ ధర మరింత పెరుగుతుంది. ముడి పదార్థాల ఖర్చు అధికమై మన పరిశ్రమలు విదేశాలతో పోటీ పడలేని దుర్గతి దాపురిస్తుంది. దానితో పరిశ్రమలు మూతపడతాయి. నిరుద్యోగం హెచ్చుతుంది.

## విదేశీ మారక ద్రవ్యం కొరత!

రూపాయి విలువ దారుణంగా పతనం కావడానికి కారణం – ప్రభుత్వం, ప్రైవేటు కార్పొరేట్ సంస్థలు కలిసి చేసిన తలకు మించిన అప్పులు. విదేశీ మారక ద్రవ్యం రాబడికి ఎగుమతులు, విదేశీ పెట్టుబడులు ప్రధాన మార్గాలు. విదేశాలతో పోలిస్తే మన బ్యాంక్ వడ్డీ రేట్లు చాలా అధికం. సరాసరిన చిన్న పరిశ్రమల యజమానులు బ్యాంకులకు 18శాతం వరకు వడ్డీ చెల్లిస్తున్నారు. అదే అమెరికా, చైనాలలో బ్యాంక్ వడ్డీ రేటు 4 నుంచి 6 శాతం మాత్రమే. ఈ తేడా వల్ల మన పరిశ్రమలు ఎగుమతుల విషయంలో అంతర్జాతీయ మార్కెట్లలో పోటీ పడలేక పోతున్నాయి. దానితో ఎగుమతుల వృద్ధి క్షీణించి పోతున్నది. మరొకప్రక్క దేశంలో పెట్రోల్ వినియోగం బాగా పెరిగి




పోయింది. నూటికి ఎనభై శాతం పెట్రోల్ దిగుమతి చేసుకోవాల్సిందే. దానితో దిగుమతుల కోసం ఏటా కొన్ని లక్షల కోట్ల రూపాయల విదేశీమారక ద్రవ్యాన్ని వెచ్చించవలసి వస్తున్నది. ఎగుమతులు, దిగుమతులు సరిసమానంగా వుంటే ఇబ్బంది లేదు. అవి తగ్గి ఇవి పెరిగి పోవడంతో విదేశీ మారక ద్రవ్యానికి కొరత ఏర్పడుతున్నది. దానితో అప్పులు చేయవలసి వస్తున్నది. అవి తిరిగి కట్ట వలసి వచ్చినప్పుడు బొక్కసం ఖాళీ అవుతున్నది.

విదేశీ పెట్టుబడులు పారిశ్రామికపరంగా వుంటే కొంత స్థిరత్వం వుంటుంది. ఒక ఫ్యాక్టరీ కట్టడానికి పెట్టుబడి పెట్టిన విదేశీ సంస్థ, అంత త్వరగా తన పెట్టుబడిని వెనక్కు తీసుకొని వెళ్లలేదు. కానీ మన్మోహన్‌సింగ్ ప్రభుత్వం పరిశ్రమల రంగంలో కంటే, షేర్ మార్కెట్‌లో విదేశీ పెట్టుబడులకే ప్రాధాన్యత ఇచ్చింది. దానితో పరిస్థితులు బాగా లేవు అనుకొన్న క్షణంలో విదేశీ పెట్టుబడిదారులు తమ పెట్టుబడులను వెనక్కు తీసుకొంటున్నారు. దానితో ఒక్కసారిగా డాలర్లకు గిరాకీ పెరుగుతున్నది. విదేశీమారక ద్రవ్య నిల్వలు కరిగిపోతున్నాయి.

మన ఆర్థిక వ్యవస్థ దిగజారిపోవడానికి మరో ప్రధాన కారణం ప్రైవేటు రంగం ప్రోత్సాహం పేరుతో విలువైన ప్రజా ఆస్తులను విచ్చలవిడిగా దోచుకొనే అవకాశం కల్పించడం. సరైన నియంత్రణ, పర్యవేక్షణ లేకుండా ఓడరేవులు, విమానాశ్రయాలు, బొగ్గు గనులు, ఇనుప ఖనిజం, బాక్సైట్ తదితర ముడిపదార్థాలు, జాతీయ రహదారుల వంటి ప్రజా సంపదను ప్రైవేటుపరం చేశారు. వాటి అభివృద్ధి పేరుతో ఆయా కార్పొరేట్ సంస్థలు బ్యాంకుల నుంచి విశృంఖలంగా అప్పులు తీసుకొనే అవకాశం ఇచ్చారు. కార్పొరేట్ వ్యాపారులు ఆ అవకాశాన్ని దుర్వినియోగం చేసి బ్యాంకులిచ్చిన అప్పులతో తమ స్వంత ఆస్తులు పెంచుకొన్నారు. స్వంత విమానాల వంటి విలాసాలకు లెక్కలేనట్లు ఖర్చు చేశారు. దానితో పారిశ్రామికులకు బ్యాంకులిచ్చిన అప్పులు వృధా అయిపోయాయి. దేశంలోని 100 ప్రముఖ సంస్థలు దాదాపు 10లక్షల కోట్ల రూపాయలు బాకీ పడి వున్నాయి ఇప్పుడు. మన రాష్ట్రం విషయమే చూస్తే జిఎంఆర్, జివికె, ల్యాంకో, ఐవిఆర్‌సిఎల్, నాగార్జున గ్రూప్, సోమా వంటి ప్రముఖ సంస్థలు ఒక్కొక్కటి పది నుంచి నలభై వేల కోట్ల రూపాయల వరకు బ్యాంకులలో అప్పులు చేశాయి. తిరిగి చెల్లించలేక చేతులెత్తేస్తున్నాయి. ఒక్క డెక్కన్ క్రానికల్ సంస్థ ఐదు వేల

కొరవ 14వ పేజీలో

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com